శృంగార గ్రంథమాల — 3.

శ్రీః

# శృంగార మల్హణచరిత్ర

ఎడపాటి

ఎఱ్ఱన మహాకవి

విరచితము

ప్రకాశకులు:

జి. యస్. శాస్త్రి అండు కో.,

మద్రాసు

# సర్వస్వామ్యసంకలితము

ప్రథమముద్రణము

లండన్ రాయల్ మెడిసన్

వెల రు. 2-0-0

చెన్నపురి:
ఆంధ్రపత్రికా ముద్రాలయమున
ముద్రితము—1927



పుష్పగంధి

# పీఠిక

బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సంపాదించి ప్రకటించిన ప్రబంధరత్నావళిని బరికింతుమేని యెన్నియేని ప్రాచీనప్రబంధరత్నములు తెలుఁగుబాసకుఁ బెట్టని తొడవులై విలసిల్లియుండెడివని తెలియవచ్చెడిని. ఆయాప్రబంధములనుండి యందుద్ధృతములైన పద్యములు వానివాని యౌత్కృష్ట్యమును, కవితామాధుర్యమును వేనోళ్లఁ జాటుచున్నవి. ఆగ్రంథములు నామమాత్రావశిష్టములై యిపుడు లభింపకుండుటచే నాంధ్రవాఙ్మయమునకుఁ దీరనిలోటు వాటిల్లినది. విస్మృతప్రాయములయిన యట్టిగ్రంథరత్నములలో నొకటియగు నీమల్హణచరిత్రమున కేకైకమగుమాతృక యిటీవల మనభాగ్యవశమునఁ దెలుఁగునాట లభించినది. దీనికి

## కృతికర్త

ఎడపాటిఎఱ్ఱనార్యుఁడు. గ్రంథావతరణికవలనను, ఆశ్వాసాంతగద్యములవలనను ఈతఁడు 'శివభక్తినిధి' యనియు, 'మంత్రి' (నియోగిబ్రాహ్మణుఁడు) యనియు 'కవితాభిజ్ఞుఁ' డనియు, 'కౌండిన్యకులోద్భవుఁ' డనియు, కృతిపతికిఁ 'గడుఁగూర్చుబంధు' వనియు, 'ఎడపాటిపురాధిపుఁ' డనియు (ఎడపాటికిఁ గరణము కావచ్చును.), 'సోమయామాత్యుని

పుత్త్రుఁ డనియుఁ దెలియవచ్చుచున్నది. ప్రబంధరత్నావళియం దీతనియింటిపేరు 'పెదపాటి' వారని కలదు. 'పాటిగలట్టి మేటి యెడపాటిపురాధిప యెఱ్ఱనార్య' అనునిందలిపద్యమున 'ఎడ' యనుచోట 'పెద' యున్నను పద్యము సరిపోవును. కాని ఆశ్వాసాంతగద్యములయందు సైత మిందు 'ఎడ' అనియే యున్నది. పెదపాడు* కృష్ణామండలమున ఏలూరునకుసమీపమున నున్నది. 'ఎడపాడు' ఎచ్చటనున్నదో! ఈసంశయమునుదీర్ప నుపలబ్ధములగు నాధారములు చాలవు.

## కృతిపతి

ఈగ్రంథమునకుఁ గృతిపతి చుండి కాళనమంత్రి. ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; సోమాంబారామయామాత్యుల పుత్త్రుఁడు; శివభక్తిపరుఁడు. ఎఱ్ఱనార్యుఁ డీతని ఘనసంపద్వైభవోపేతుఁ డనియు, సహజదాతయనియు, బంధుప్రియుఁడనియు, కవిపండితపోషకుఁడనియు, యోధాగ్రేసరుఁడనియు, దేశాంతరాస్థానకవివరవర్ణనీయగుణగణుఁ డనియు వర్ణించినాఁడు. మఱియు నీతని 'చుండిపురపాలక', 'చుండిపురాధిప' అనియు, కొండొకచో 'చుండిస్థలగ్రామణి', 'చుండిస్థలకరణచంద్ర' అనియుఁ బేర్కొన్నాఁడు. 'చుండి' నెల్లూరుమండలమున నెల్లూరుపురమునకుఁ జెంతనున్న యొక చిన్నసంస్థానము. దీని నైదాఱుశతాబ్దములనుండి బ్రాహ్మణులుపరిపాలించినట్లు తెలియ

* ప్రబంధరత్నావళిపీఠిక—పే. ౩.

రాదు. కావున కృతిపతి చుండిసంస్థానమున స్థలకరణముగ నుండి సంస్థానకార్యములను జక్కఁబెట్టుచు మంచి పలుకుబడి గలిగి పేరుగాంచి యుండవచ్చును.

## కృతిరచనాకాలము

కవి తా నీప్రబంధమును శ్రీకృష్ణదేవరాయలకాలముననే రచియించి యాతని కేకారణముననో యంకితముసేయక యీ కాళనమంత్రికిఁ గృతి నొసంగినట్లు

"ఉ. ఇట్టిమహాప్రధానపరమేశ్వరమూర్తివి గాన నీవు చే
పట్టితి మేలు చుండిపురపాలక, కాళనమంత్రిచంద్ర, ముక్
గట్టిగఁ గృష్ణరాయజనకాంతున కీయక దాఁచినట్టి యా
రట్టడియైన యెఱ్ఱకవిరాజిత మల్హణకావ్యకన్యకన్."

అని చెప్పికొన్నాఁడు. ప్రబంధరత్నావళిని సంధానించుటకు సాధనములగు రెండుగ్రంథములలో నొకటియగు ప్రబంధరత్నాకరమునఁ బెదపాటి జగన్నాథకవి యీమలహణచరిత్రమునందలి పద్యముల నుద్ధరించియుండుటచేతను, అం దాతఁడు చేర్చినకవులలో మాదయగారి మల్లయ, తెనాలిరామలింగయ యర్వాచీనులగుటచేతను, ఎఱ్ఱనార్యుఁ డిందుఁ గృష్ణదేవరాయలకుఁ బూర్వులు, సమకాలికులు నగు కవులనే వినుతిచేసియుండుటచే తను ఇది శ్రీ కృష్ణదేవరాయలకాలమున (క్రీ. శ. ౧౫౦౦ ప్రాంతముల) రచియింపఁబడినదని తేలుచున్నది.

## ఎఱ్ఱనార్యుని యితరకృతి

ప్రబంధరత్నావళియందు 'కుమారనైషధము' నీతని కృత్యంతరముగఁ జేర్కొని యందలిపద్యములను గొన్నిటిని జగన్నాథకవి చేర్చినాఁడు. మలహణచరిత్రమున నెఱ్ఱన తాను 'సరసకవితాచతురుఁడ' ననిమాత్రము చెప్పికొనెను గాని యితరకృతిని రచియించినట్లు చెప్పలేదు. 'కుమారనైషధము' నందలి యీ పద్యము లిందలి పద్యములకంటెఁ బ్రౌఢములుగఁ జూపట్టుచున్నవి. ఆకృతిని దీనికిఁ దరువాత రచియించినాఁడేమో?

## మలహణచరిత్రము

ఇందలి యితివృత్తము శివభక్తిమాహాత్మ్యప్రతిపాదకమయినది. కథానాయకుఁడు సుప్రఖ్యాత సంస్కృతకవియగు మలహణుఁడు. కథానాయిక పుష్పగంధియను వేశ్య. ఈకథ పాల్కురికి సోమనాథకృత మగు పండితారాధ్యచరిత్రమునఁ గలదు. అం దీవిధముగ నున్నది:

“శివభక్తుఁడు, కవియు నగు మలహణుఁడను నాతఁ డొక వేశ్యను బ్రేమించి దానిని గూడియుండెను. మాయలమ్మియగు సానితల్లి వారిపొందున కిచ్చగింపక యాతనిఁ బడఁదిట్టి పోఁద్రోలి కూఁతు నొకమండలాధిపతికిం గూర్చెను. మలహణుఁడు వేశ్యావియోగమును భరింపఁజాలక, దానిని మఱలఁ బొందు మార్గమునుగానక మిగులఁ బొక్కుచు దాని పలుకులనైన విని కొంత మనశ్శాంతిని బడయవచ్చునని తలఁచి యొకచీకటిరేయిని

వర్ణితములైనవి. ధనదత్తుని (కోమటిసెట్టి) మాటలు, చేష్టితములు నవ్వును గొల్పుచుండును. ఆయాయిపట్టుల నాయాయి విషయములంగూర్చినవర్ణనము లిందు స్వభావోచితములుగ నలరారుచున్నవి. కవితావైభవమున నీగ్రంథ మాంధ్రభోజుఁడగు కృష్ణరాయలకాలమున వెలసిన యితర పరసప్రబంధములకుఁ దీసిపోవక సహృదయహృదయంగమముగ నున్నవి. 'తినఁబోవుచు రుచు లన్న నేల?' సహృదయు లాస్వాదింపనున్న యీ రసవత్ప్రబంధ మాధుర్యమునుగూర్చి యిట వెచ్చుగ నుప్పటింపఁ బనిలేదు.

మాకు లభించిన మాతృక యొక్కటియే యగుటచేతను, అదియు శిథిలమై, దోషభూయిష్ఠమై యుండుటచేతను ఈ గ్రంథము నింతకంటె నిర్దుష్టముగ ముద్రింపఁజాలమికి మమ్ము మన్నింపఁ బండితుల వేఁడెదము. చివికి చెదలుపాలగుచున్న ప్రాచీనప్రబంధరత్నముల నుద్ధరించి యిట్లు సుందరముగఁ బ్రకటించుటకుఁ బూనుకొన్న మా కాంధ్రలోకము సాదరభావముతోఁ బాసటలై మున్ముందు నిత్యాధికభాషాసేవకు మమ్ముఁ బురికొల్పుఁగాక యని విశ్వసించుచున్నాము.

మాకుఁ గోరినవెంటనే తమకడనున్న మాతృకను బంపిన కోవని గ్రామనివాసులు శ్రీ శ్రీపతి పండితారాధ్యుల శరభశాస్త్ర్యయ్యవార్లంగారికిఁ గృతజ్ఞతాంజలులనర్పించుచున్నాము.

ప్రభవ జ్యేష్ఠ శుద్ధ పూర్ణిమా సౌమ్యవారము. } గంటి సూర్యనారాయణశాస్త్రి,
సంపాదకుఁడు.

శ్రీః

# శృంగారమల్హణచరిత్ర

## ప్రథమాశ్వాసము

---

శ్రీ లలితంబు సానునయ
శీతగుణంబును జారుపాదకే
ళీలసనంబుఁ జన్నుఁగవ
గట్టితనంబు నితంబశోభయుఁ
బోలును గౌరి తండ్రిబడిఁ
బుట్టినదంచు హసించు శంభుఁ డే
వేళను జుండి కాళునకు
వేడుక నీవుతఁ గామితార్థముల్.

ఉ. శ్రీరమణీమనోహరుఁ డ
శేషసురస్తవనీయమూర్తి శృం
గారరసాధినాయకుఁడు
కామినులం బదియాఱువేల ని

చ్చారతి నేలుకృష్ణుఁ డని
శంబు సుఖార్థ్యునిఁజేయుఁ గామినీ
మారునిఁ జుండిరామయకు
మారునిఁ గాళనమంత్రి శేఖరున్.

ఉ. "అంబుజసూతి, నీవు భువ
నావలిఁ బ్రోడవు నాదు వీణ భా
వంబున నాలపించు"మని
వాణి హసం బొనరింపఁ బోలు ని
త్యంబును సామగానముల
నభ్యసనం బొనరించుధాత నె
య్యంబునఁ జుండికాళనఁ జి
రాయురుపేతునిఁ జేయుఁ గావుతన్.

ఉ. నిండి మహామునీశ్వరులు
నిర్జరకోటులుఁ జూచుచుండఁగాఁ
దుండమునందు నందుకొని
తోరపుఁ బండులుఁ బిండివంటలుఙ్
దండిగఁదించు మించి తలి
దండ్రులకుఙ్ బ్రమదంబుఁ జేయు వే

దండముఖుండు చుండిపుర
ధాముని గాళన ధన్యుఁ జేయుతన్.

సీ. దంతకాంతినితాంతధాళధళ్యములైన
ధౌతవస్త్రములు ముత్యాలయిండ్లు
కలశాబ్ధిఁ బుట్టి పుష్కరమునఁ జూపట్టు
మొలకచుక్కల్ఱేఁడు మొగలితేకు
వేదశాస్త్రపురాణవిద్యల కొరగల్లు
వలచేతఁ బాలుపారు కలికిచిలుక
అతులితరత్నకీలిత భాసురంబైన
బంగారుకిన్నెర పలుకుఁదోడు
ప్రణవవర్ణంబు దానుండు భద్రపీఠి
గాఁగ నింపారు నజురాణి కమలపాణి
వాణి కృపసేయు నెపుడు వాగ్వైభవంబు
నెలమితోఁ జుండికాళమంత్రీశ్వరునకు.

సీ. కలశాంబురాశిలోపలఁ బుట్టి యేదేవి
వాసుదేవుని రాణివాసమయ్యె
వనజాక్షు మెప్పించి వక్షస్స్థలంబున
నేదేవి నెలకొని మోదమందె

లోకమాత యనంగ లోకత్రయంబునఁ
జెలఁగి యేదేవి ప్రసిద్ధయయ్యె
నఖిలసంపదలు నింద్రాదుల కేదేవి
కడకంటిచూపునఁ గలుగుచుండు
వికసితాంభోజ మేదేవి వీడుపట్టు
అట్టి శ్రీదేవి కరుణఁ జేపట్టి యొసఁగు
భాగ్య సౌభాగ్యవైభవప్రాభవములు
నెల్లపుడుఁ జుండికాళమంత్రీశ్వరునకు.

మ. తెలియంగా నట నీదుమస్తకమునం
దేకాదు భావింప నీ
నిలువెల్లన్ నటలంచు నాత్మవిభు నెం
తే నేర్పుతో నవ్వ నె
చ్చెలి కంఠంతకుఁ గన్ను సన్నఁ బ్రమద
శ్రీ నించు గౌరీవధూ
తిలకం బీవుతఁ జుండికాళునకుఁ బ్రీ
తిన్ భాగ్యసౌభాగ్యముల్.

ఉ. శంభుజటాటవీతటవి
శంకటసింధుతలప్రఘుంఘుమా

రంభవిజృంభితధ్వనిధు
రంధరభూరితరప్రబంధవా
గ్గుంభుల నాత్మలోఁ దలఁతుఁ
గూర్మిని మ్వాఘ కాళిదాసులన్
దంభమయూరమాఘవర
దండి ముఖాదిమసత్కవీంద్రులన్.

చ. వినుతు లొనర్తు నాంధ్రసుక
విప్రభు నన్నయభట్టుఁ దిక్కయ
జ్వను శివదేవు భాస్కరుని
జక్కన నాచనసోము సర్వదే
వుని భవదూరు వేము నల
పోతనఁ బిల్లలమఱ్ఱి వీరభ
ద్రుని శరభాంకు వీరకవి
ధూర్జటిఁ గేతన భట్టబాణునిన్.

క. వెండియు నాదృతమతినై
నిండుమనంబునను దలఁతు నిఖిలధరిత్రీ
మండలవిశ్రుతకవితా
ఖండయశోనిధులఁ బేరుగల సత్కవులన్.

క. చెలరేఁగి యంతకంతకుఁ
జలమున వాఁదడవఁ గుకవి సత్కవి యగునే
యిలలోన నెంత బలిసినఁ
జెలఁగి వరాహంబు గంధసింధుర మగునే? ✓

వ. అని యిష్టదేవతాప్రార్థనంబును సత్కవికీర్త
నంబును గుకవినిరసనంబునుం జేసి నవరసభావ
బంధురంబుగా నొక్కప్రబంధంబు రచియింపం
దలంచియున్న సమయంబున.

సీ. ఏమంత్రినునుఁజూడ్కి ధీమదాశ్రితదైన్య
తామిస్రమునకు నైందవకరాళి
ఏమంత్రియాజ్ఞప్తిసామంతసీమంతి
నుల కొప్పు విరుల కగ్గలపుగాలి
ఏమంత్రి వితరణం బినసూనుఖేచర
ప్రకటదానప్రౌఢిఁ బరిభవించు
నేమంత్రికీర్తి శైలేంద్రకన్యాధీశు
కంఠహాలాహలాంకంబు గప్పు
నతఁడు నేపాళ కురునిషధాంగవంగ
గౌళగాంధారమగధకొంకణవిదేహ

నృప మహోస్థానకవివర్ణనీయగుణుఁడు
చుండి రామయకాళుఁ డఖండయశుఁడు.

సీ. కనకాంబరములు శృంగారించి మించిన
మహనీయనవరత్న మంటపమున
ఘనసారచందనకమనీయవాసన
లఖిలదిక్కులయందు నలమికొనఁగఁ
గవిగురుశేషవాక్కాంతాధిపులఁబోలు
సత్కవీశ్వరులు పార్శ్వములఁ జెలఁగఁ
దుంబురునారదాదులు గొల్వఁజాలినఁ
గాయకు లగ్రభాగముల మెఱయఁ
కనకసనవసనమాణిక్యఘటితభూష
ణావళులకాంతి సభికుల నావహింపఁ
గొలువు కొలువయి సాహిత్యగోష్ఠిఁ దగిలి
నన్నుతోఁదారుఁ డావేళ నన్నుఁజూచి.

క. "శివభక్తినిధివి మంత్రివి
కవితాభిజ్ఞుఁడవు నిత్యకారుణ్యమహో
త్సవుఁడవు కౌండిన్యకులో
ద్భవుఁడవుఁ గదుఁ గూర్చినట్టి బంధుఁడ వనఘా!

ఉ. పాటిగలట్టి మేటి యెడ
పాటిపురాధిప, మెజ్జినార్య, నీ
సాటిగఁజెప్పినట్టి కృతి
సాటువయై విలసిల్లుఁగా కిటుల్
జాటుచు హీనమానవుల
చాటునమాటున వ్యర్థకూటకా
ర్పాటకథల్ వినంగ నగు
బాటగుఁగాక రుచింపనేర్చునే?

క. మలహారుభక్తులలోపలఁ
బొలుపుగ నుతికెక్కి జగతిఁ బూజ్యుండగు నా
మలహాణుకథ నాపేరిటఁ
జెలువుగ నంకితముచేసి చెప్పఁగవలయున్.

చ. అనుచుఁ బసిండికోరఁ బ్రియ
మారఁగఁ గప్రపువీడియంబు గాం
చనమణిగంధసార ఘన
సారవిభూషణవస్త్రసంపదల్
దనిపిన నాత్మలోపల ము
దంబు వహించుచు నాప్రధాన చం

ద్రునకును భక్తితోడఁ గృతి
  నాత్మగతిఁ సృజియింపఁ బూనితిన్.

ఉ. ఇట్టిమహాప్రధానపర
  మేశ్వరమూర్తివి గాన నీవు చే
పట్టితి మేలు చుండిపుర
  పాలక, కాళనమంత్రిచంద్ర, ముఁ
గట్టిగఁ గృష్ణరాయజన
  కాంతున కీయక దాఁచినట్టి యా
రట్టడియైన యెఱ్ఱకవి
  రాజిత మల్హాణకావ్యకన్యకన్.

ఉ. ఇమ్మహిఁ గల్గుమంత్రుల న
  నేకులఁ జూచితి మేము వారు మో
దమ్మున నిచ్చినట్టి ధన
  ధాన్యయుతంబగు దొడ్డయీవియుఁ
సమ్మతితోడ నీవొసఁగు
  సారపుఁ గప్రపువీడియంబు తు
ల్యమ్మగుఁ జుండిపాలన ద
  యాకర, కాళన మంత్రిశేఖరా!

ఉ. ధన్యతఁ జుండికాళన, యు
    దారయశోంబగన నిన్నెకాని నే
నన్య మెఱుంగనంచుఁ గల
    శాంబుధిఁ దానముఁ జేసి రాజమూ
ర్ధన్యులముందటన్ దగఁ బ్ర
    తాపశిఖిం ధరియించి భోగిరా
జన్యశిరంబుఁ బట్టి జల
    శాయిపదంబులు ముట్టి మేల్గనన్.

సీ. తనసముద్ధతకీర్తి దశదిశావిశ్రాంత
    దంతిదంతములతోఁ దర్కరింపఁ
దనమనోహరమూర్తి తరుణతాహంకార
    మానినీజనముల మరులు గొల్పఁ
దనదానవిస్ఫూర్తి ధనరాజసంతాన
    చింతామణిశ్రేణి సిగ్గుపఱుపఁ
దనవాగ్విలాసంబు దండశూకాధీశ
    దేవేంద్రగురువుల సేవగింపఁ
బరగు సురసరిదురుతరబహుతరంగ
నివహాఘుమఘుమరవసమనినదసుకవి
ఫణితవరగుణమణిగణాభరణశాలి
చుండిరామయకాళఁ డఖండయశుఁడు.

ఉ. చెంపల గంధముల్ మెఱుఁగుఁ
జెక్కుల నొత్తిన మన్మథాంకపుం
గెంపులు వీటికావిహిత
కృత్రిమరాగము కంటి యెమ్మెలుల్
మంపుగొనంగఁ గ్రుమ్మఱు కు
మంత్రుల ఁజూచిన రోఁతమాను ని
ష్కంపనుఁ జుండిరామవిభు
కాళనఁ జూచినయర్థికోటికిన్.

సీ. సంపూర్ణచంద్రుఁ డీసరసుఁడు కాళన
వివరింప రోహిణి విస్సమాంబ
కందర్పుఁడయ్యె నీకాళనామాత్యుండు
విశ్రుతరతిదేవి విస్సమాంబ
గంగాకలాపుఁ డీకాళనామాత్యుండు
వినుతపార్వతిదేవి విస్సమాంబ
కలశాంబురాశి యీకాళనామాత్యుండు
విమలభాగీరథి విస్సమాంబ
యవని ననుకూలదాంపత్య మగునటంచు
నఖిలజనములు వినుతింప నతులమహిమ

మంత్రి రామయ కాళనామాత్యచంద్రుఁ
డనఘు విస్సాంబ నుద్వాహమయ్యె నెలమి.

సీ. పరకాంతఁ జూడఁడు పైత్రోవఁ జూచెనా
వర్ణించు మఱి కానివానిగాను
తఱచు మాటాడఁడు తగుచోటనాడెనా
యబ్రహ్మపదము శిలాక్షరంబు
తర మెఱుంగక యీఁడు తగ మెచ్చి యిచ్చెనా
చాలు నర్థికి జన్మజన్మములకు
మనసీక నిల్పఁడు మది నిచ్చి నిల్పెనా
యది విభీషణుపట్టి మచ్యుతంబు
రక్ష రాష్ట్రమునకును శ్రీరామరక్ష
యాజ్ఞ సుగ్రీవునాజ్ఞగా నడఁచె రిపులఁ
బుణ్యవంతుండు సద్గుణభూషణుండు
చుండిరామయకాళఁ డఖండయశుఁడు.

షష్ఠ్యంతములు

క. ఈదృశగుణజలరాశికి
శ్రీదేవీవరతనూజ శృంగారునకున్

భూదానభార్గవునకును
భూదేవీవరవిభూతిమహిమాఢ్యునకున్.

క. బంధురవిక్రమశాలికి
సింధుగభీరునకు శేముషీధిషణునకున్
బంధుప్రియునకు నీతియు
గంధరునకు శంభుభక్తికలితాత్మునకున్.

క. యోధాగ్రేసరునకు నుత
రాధేయసమానదాన రసికాగ్రణికిన్
భూధరరిపువిభవునకు న
సాధారణ ధైర్యశౌర్యసద్గుణమణికిన్.

క. అద్రీంద్రధైర్యునకు స్వా
మిద్రోహరగండనవసమీరబలునకున్
రుద్రాక్షభూతిభూషణ
ముద్రాంకునకున్ బ్రధానమూర్ధన్యునకున్.

క. దుస్సంగదూరునకును న
భస్సింధుసమానకీర్తిభరితాంకునకున్
నిస్సీమభూప్రదాతకు
విస్సాంబాధవున కఖిలవిద్యానిధికిన్.

క. శ్రీమంతున కఖిలకళా
ధామునకును గీర్తినిధికి ధర్మాత్మునకున్
సోమాంబాతనయునకు మ
హామహునకుఁ జుండికాళయామాత్యునకున్.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నా యొనర్పం
బూనిన మల్లణచరితం బను మహాప్రబంధ
మునకుఁ గథాక్రమం బెట్టిదనిన:

సీ. కువలయకమలాభినవమనోజ్ఞం బయ్యు
బంకజీవనపరిప్లవము గాక
ఘనసారపున్నాగకమనీయ మయ్యును
కితవదుష్కానకసంయుతము గాక
సాధుదానప్రౌఢిమాధిపం బయ్యును
విశ్రుతఖరసమన్వితము గాక
రాజితోత్తమజాతిరత్నాంకితంబయ్యు
శృంగారకూటదూషితము గాక
వరసరోవరచయమును వనచయమును
నృపచయంబును దివ్యమంటపచయంబు
నెలమిఁ దనుబోలెననఁ బొగడ్తలు వహించె
భువనసారంబు కల్యాణపురవరంబు.

గీ. కలితకైవల్యకల్యాణకటకమనఁగఁ
గామితార్థైకకల్యాణకటకమనఁగఁ
గమలసదనాంఘ్రికల్యాణకటకమనఁగ
ఘనతగాంచెను కల్యాణకటక మపుడు.

చ. గములుగఁ బద్మరాగములఁ
గమ్రమరీచులు చౌకళింపఁగాఁ
గమలవనంబు లెన్నఁడు వి
కాసముఁ గుందవు వజ్రమౌక్తికా
సమరుచిచంద్రికన్ గుముద
షండములన్ గసుగందకుండు నాఁ
గొమరగుదివ్యరత్నమయ
గోపురవైభవ మెన్న నేటికిన్?

క. కురువిందవజ్రమయగో
పురదీప్తులవలనఁ బ్రొద్దు పోకల్ రాకల్
పరికింప నరిది యయ్యెను
సరసిజకైరవవికాససంపదఁ దెలియున్.

క. తలయెత్తి చూచినప్పుడు
తలవంచినయపుడుఁ దెలియు దైవతఫణిలో

కులవార్త లనఁగ వినుతికి
నలవియె పురికోటపాడవు నగడితలోఁతున్

క. దైవతమూర్తులు తేజో
వైవస్వతజనకు లేకవదనబ్రహ్మల్
పావనచారిత్రులు పుం
భావనరస్వతులు పురముబ్రాహ్మణులెల్లన్.

క. వారణవారణసత్త్వులు
శారద శారదవిలాస సమధికకీర్తుల్
మారుత మారుతవేగులు
మారనిభుల్ పురమురాకుమారకు లెల్లన్.

క. జలనిధి రోహణశైలము
మలయాద్రిన్ గనకశిఖరి మఱపించిరి యు
జ్జ్వలరత్నచందనశ్రీ
నలరెడు భువనైకవశ్యు లప్పురివైశ్యుల్.

క. బలభద్రులు శాలి వన్నృప
దళ దళనోన్నిద్రు లమితదానమరుద్ద్రుల్
లలనాభద్రులు కలఁగని
యలఘుసముద్రులు సముద్రశూద్రకులెల్లన్.

క. సటలాడింతురు సింహాముఁ
జెటపెట బెబ్బులులపండ్లు పెఱుకుదురు మహో
త్కటదంతిఁ గూలఁద్రోతురు
పటుసమహోద్భటులు వీరభటు లవ్వీటన్.

క. పిడికిట నడఁగెడు నడుములు,
సడిఁగౌఁగిలిఁగొనని గుబ్బచన్నులు, చేరల్
గడచు తెలిగన్ను లప్పురి
పడఁతులకుం గాక కలదె పడఁతుల కెందున్.

క. గళదండతుండగండ
స్థలదృఙ్మదకాండ భద్రదంతులు చెలఁగున్
బలువిడి సెలయూటలతో
నలరెడు నలకొండ లనఁగ నప్పురిలోనన్.

క. వరజవసంపద నప్పురి
తురగంబులఁ బోలలేని తుందుడుకున నీ
ధర నడువనోడి యప్పుడు
నరుగు నభంబున వితేజులై రవితేజుల్.

క. మోపులు గైకొని యమృతపుఁ
దీపుల కెడఁబడిన తరఁగతెఱఁ గంభోధుల్

తేపులు మాపులు నప్పురి
వాపుల చలిగాడ్పులాని వాపుల వదలున్.

వ. మఱియు నప్పురంబు సత్యలోకంబునుంబోలెఁ జతురాననాధిష్ఠితంబై, వైకుంఠపురంబునుం బోలెఁ బురుషోత్తమావాసంబై, కైలాసంబునుంబోలె సర్వజ్ఞాభిరామంబై, అమరావతియునుంబోలె మఘవద్విజితంబై, అలకాపురంబునుంబోలె ధనదవిలసితంబై, నక్షత్రగ్రహమండలంబునుబోలెఁ గళానిధిశోభితంబై, వియన్నదియునుంబోలె లక్ష్మీసముదయంబై, మాతంగవిరహితంబయ్యు మదమాతంగయుక్తంబై, భోగిదూరంబయ్యు ననేకభోగిభూషితంబై, అస్రుపాతంబు పురాణపఠన శ్రవణవేళయంద, చేలచలనంబు ధ్వజంబులయంద, పరవశత్వంబు రతిసమయంబులయంద, దీర్ఘనిశ్వాసంబు పారయోగులయంద, అన్యోన్యసంఘర్షణంబు యువతీస్తనంబులయంద, పాణిగ్రహణంబు వివాహంబులయందకాని తనయందుఁ బొనరవనంజాలి చక్కఁదనంబుకుఁ

జక్కటియు, మగతనంబులకు మగంటిమియు, సంపదల కింపును, యశంబునకు వశంబును, సౌఖ్యంబులకు సౌఖ్యంబును, విద్యలకు నాద్యంబును, విశ్వాసంబున కాదికారణంబును నగు నప్పురవరంబున:—

సీ. యజ్ఞదత్తుండను నవనీసురోత్తముం
డఖిలవేదంబుల నభ్యసించి
నవరసజ్ఞాతయై నవకళానిపుణుఁడై
సకలదేశంబులు సంచరించి
ధనరత్నవస్త్రవాహనతతు లొనగూర్చి
భాగ్యసౌభాగ్యవైభవము లెసఁగ
వనజలోచనఁ బుణ్యవతియను సాధ్విని
బరిణయంబై నిజబంధుజనము
నాప్తవర్గంబు ముదమంది యభినుతింప
నతిథిపూజలు సేయుచు నాగమోక్త
క్రతువు లొనరించి పెద్దల కరుణ గాంచి
నిండు వేడుక దళుకొత్త నుండి యతఁడు.

క. నరకాంబుధిఁ బడి మునిఁగెడు
పురుషునకుం దెప్పగాదె పుత్త్రకుఁ డిలఁ "బు

న్నరకాత్త్రాయతి” యనియెడు
పరమశ్రుతి దలఁపనైతి భావములోనన్.

క. సంతానము ఇహపరమును
సంతానము పుణ్యలోకసాధన మరయన్
సంతానము నిలహేతువు
సంతానము లేనివాని జన్మంబేలా?

క. సుతుఁ డుదయించినమాత్రనె
పితరుల దుర్గతులుదొలఁగుఁ బెరుఁగుచు మరి య
సుతుఁ డెంత చల్లనుండినఁ
బితరుల కతితృప్తిసేయుఁ బృథుతరలీలన్.

క. పితరులసుగతికి మూలము
సుతుఁడ 'యపుత్రస్య నాస్తిసుగతి' యనంగా
లతికామూలన్యాయము
పితరులకును సుతున కండ్రు పేర్కొని పూనుల్

సీ. వరరత్నధనధాన్య వస్త్రసమృద్ధైక
సీమలు గలిగిన నేమిఫలము?
మణిహేమమయకుడ్యమంటప కమనీయ
ధామముల్ గలిగిన నేమిఫలము?

శ్యాలకజామాతృసఖిమిత్రబాంధవ
స్తోమంబుగలిగిన నేమిఫలము?
చామరాందోళికాఛత్రసైంధవరథ
సామజంబులుగల్గి నేమిఫలము?
ఘోరసంసారసాగరపారనిబిడ
మధ్యనిర్మగ్నులైనట్టి మానవులకు
సకటదరిఁజేర్పఁ జెప్పమైనట్టిసుతుఁడు
గలుగకుండిన నెంతటిఘనునకైన.

మ. అని యూహించుచు నమ్మహీసురుఁడుచిం
తాయత్తవృత్తి న్నతా
ననుఁడై పుణ్యావతీవధూతిలకముం
దానుఁ నిజాంతర్గృహం
బునఁ గమ్మాయకభోజ్యవస్తువితతుల్
భుంజింపఁగానీక యి
చ్చనజస్రంబును వత్సకాంక్షలను బ
శ్చాత్తాప సంయుక్తుఁడై.

మ. ఉపవాసంబులు సత్యధర్మమహితో
ద్యోగాదికృత్యంబులుఁ

జపముల్ విప్రకుటుంబభోజనములున్
శాంతుల్ పయస్సత్రముల్
తపముల్ దైవతపూజనక్రియలు తీ
ర్థస్నానముల్ దానముల్
విపరీతప్రతిబంధమోక్షణవిధుల్
వేమాఱు గావించుచున్.

సీ. బహువిధస్తోత్రముల్ పఠియింప బఠియింప
బొలుపఱి నోరెల్ల బొరట వోయె
మొగి వేల్పులకు జాగి మ్రొక్కంగ మ్రొక్కంగ
బొప్పక నొసలెల్ల బొగసుగట్టె
ధరబ్రదక్షిణములు దిరుగంగదిరుగంగ
నెల్లవెంటలను గాళ్లీచవోయె
విధులకై ధనములు వెచ్చింపవెచ్చింప
జెలువేది జేయెల్ల జెరటయయ్యె
బూని యుపవాసములచేత బొగిలిపొగిలి
కోలుకొనలేక యొడలెల్ల గ్రుస్సిడస్సి
చాలు నన్నింట డెందము చల్లనయ్యె
నింక నేమిట దోడెస గెట్టుమనుడు?

గీ. సురభిపొదుగున దుగ్ధముల్ దొరకుఁగాక
తవిలి యున్న యజాగళస్తనము లొడియ
నీశ్వరేశ్వరుకృపఁ గోర్కు లెసఁగుఁ గాక
యితరకృత్యంబులందెల్ల నేల కలుగు?

వ. అని తనవృత్తాంతం బాధర్మపత్ని కెఱుంగఁ
జెప్పి తా నొక్కరుండ పురంబు వెలువడి వచ్చి
వచ్చి యఖిలజనానందమయి యవసరంబుల
నుత్ఫుల్ల మల్లికా వకుళ కేతకీ కుటజ పాటలీ
పున్నాగ పరిమళామోద పరిహృత పరిశ్రమ
పథికజనానుమోదంబును, విచ్ఛిన్న స్వచ్ఛ
గుళుచ్ఛ నిష్యూతమరందబిందు ధారానందిత
తుందిలనటదిందిందిరమాలికాసందోహ క్రియా
ఝుంకారంబును, ఉన్మదశుకశారికా కేకికలరవ
కలకంఠకోమలతరంగిత మేదురనాద మాధురీ
ధురీణతామానంబును, బిసగ్రసనకౌతుకకల
హంస సంకుల క్రేంకారగుంభితవిచరత్కిన్నర
మిథునమధురగానంబును, సహకారకదళీపనస
ఖర్జూరద్రాక్షానారికేళబింబజంబీరమాతులుంగ
ఫలసమిత్కుశాయాత మునికుమారనిరంతరం

బును నగు వనాంతరంబున నొక్క వటవిటపి చ్ఛాయం దపం బున్న కపింజలమహాముని యాశ్రమంబుఁ జేరంజని.

సీ. తుండముల్ నిమురు భేరుండముల్ శరభంబుఁ
బాము భేకములకు బాముఁగడపు
నాగముల్ హరుల పన్నాగముల్ గని మెచ్చు
ముంగి రమ్మను ఫణి ముంగిటికిని
పులిపాలఁ ద్రావించు బులిపాల మృగపిల్ల
పిల్లితో నెలుక దంపిల్లియాడు
తోడేలునకు మేఁత తోడేలు చెంబోతు
పులుగువెట్టును డేగ పులుగునకును
కారుపోతులఁగని యాడు కారుహయము
కొండగాఁ జూచుఁ గీశంబు కొండగోఱియ
పికముపన్నదు కాకంబు పికముతోడ
జాతివైరంబు లుడిగి తజ్జాతి నిట్టు
లెనసి కూడుండు ప్రాణు లమ్మౌని యునికిని.

వ. ఇట్లున్న యమ్మునితపోమహిమకు నిచ్చ మెచ్చుచుఁ జేరంజని సాష్టాంగదండప్రణామంబు లా

చరించినం జూచి యమహ్మానీంద్రుం డతనిరాక
మానంబున నెఱింగి నీమనోరథంబు సఫలంబ
య్యెడు నిక్కడఁ దపంబాచరింపుమని యను
జ్ఞయిచ్చిన నయ్యబ్జదత్తుండును దదుపదిష్టమా
ర్గంబునఁ దపస్సాధనంబులోనగూర్చుకొని యం
దంబున నపరనందీశ్వరుహృత్పదయారవిందంబు
నఁ బొందుపఱిచి ఫలాహారపర్ణాహారపవనా
హార పరిహృతాహారుండై పరమతపోనిష్ఠ
వాటించుచున్న సమయంబున నప్పరమేశ్వ
రుండు ప్రసన్నుండైనం బ్రణమిల్లి యిట్లనియె.

సీ. కరిముఖజనకాయ కనకాద్రిచాపాయ
మరుసంహరాయ నమశ్శివాయ
కుండలికటకాయ గోరాజవాహాయ
మాధవాస్త్రాయ నమశ్శివాయ
శైలజాధీశాయ సనకాదివంద్యాయ
మధుపాంతకాయ నమశ్శివాయ
సోమార్కనేత్రాయ సురనదీజూటాయ
మంత్రభూపాయ నమశ్శివాయ

భక్తపరతంత్రహృదయాయ భవహరాయ
మాతృకావేష్టితాయ నమశ్శివాయ
సకలలోకాధినాథాయ శాశ్వతాయ
తే నమోస్తు మహాదేవ దేవ" యనిన.

మత్తకోకిలము:

"భూసురోత్తమ, యాత్మ మెచ్చితి
పుత్త్రు నీ కిదె యిచ్చితిన్
వాసవాదులు సన్నుతించెడు
వాని మత్ప్రియభక్తునిన్
రాసికెక్కు కులైకభూషణు
రమ్యకీర్తివిరాజితున్
ధీసమున్నతు సత్కళానిధి
దివ్యతేజు గుణాకరున్."

వ. అని సర్వేశ్వరుండు సంతానలబ్ధికై యొక్క
సంతానఫలంబు దయచేసినఁ బుచ్చుకొని కపిం
జలమహామునియనుమతంబునఁ బురంబున కరు
గుదెంచి తనధర్మపత్నియైన పుణ్యవతికి నొసం
గె నంతఁ గ్రమక్రమంబున.

సీ. పసిఁడిపుత్తడికిని బల్వాంబుమరువుగా ✓ Important
నిలిపినగతి మేను పలుకఁబాఱె
కస్తూరి లాంఛనగా నిడ్డ యమృతంపుఁ
గుంభద్వయంబనఁ గుచము లమరె
లలి దంపతులమోహలతికాంకురంబన
గరువపు నూగారు గానవచ్చె
తనయాభివృద్ధిచేతను లేమి యంతయు
బెడఁబాసెననఁగ నెన్నడుము వడఁకె
సుషమసంతానసౌఖ్యాబ్ధిఁ జొక్కి యాత్మ
నన్యముల రోయుగతి మది నరుచి వొడమెఁ
దనయ లావణ్యరసపూర్తి తెల మనఁగ
నంగనకు గర్భసంపద యందమయ్యె. ✓

క. నవమాసంబులు నిండిన
యువతీమణి పుత్త్రుఁ గాంచె నురుతరతేజు
భవకరుణామృతసాగర
భవవిగతకళంకకుముదబంధుఁడనంగన్.

✓ క. ఏలికవలెఁ జూడఁగవలె Important
బాలకు నైదేండ్లు, బంటువలెఁ బెంచుచుఁ దా

నేలగవలెఁ బదియేఁడులు
వాలఁగ నటమీఁద సఖునివలెఁ జూడఁదగున్.'

వ. అని యజ్ఞదత్తుండు పుత్త్రకునకు నుదయాది
కృత్యంబులు గావించి విద్యానిధియను బ్రాహ్మ
ణునొద్దఁ జదువంబెట్టిన నతండు.

సీ. అంగయుక్తంబుగా నామ్నాయములు రెండు
బల్లిపాఠంబుగాఁ బరిచయించె
బ్రహ్మాండశైవాది బహుపురాణంబులు
కరతలామలకంబుగా నెఱింగె
భాట్టవైశేషికప్రముఖశాస్త్రంబులు
నవగతంబులుగాఁగ నభ్యసించె
శుకులవ్యాసాదిదేశికుల తత్త్వార్థముల్
శోధించె నామూలచూడముగను
వాదవహ్నిజలస్తంభనాదు లరసె
నంజనాకర్షణక్రియ లలవిఁ గనియె
సరససంగీతసాహిత్యసరణిఁ దెలిసె
నఖిలవిద్యావిశారదుం డయ్యె నంత.

క. అన్నగరము వేశ్యాలలో
నెన్నంగా నొక్కబోటి యిల నన్నింటన్
మిన్నక నడినన్నది యది
చెన్నలరుచునుండు మదనసేన యనంగన్.

క. ఆయక్క యెన్నినోములు
పాయక కడునోచి కన్న బాలిక కంతుం
డేయక దాఁచిన మోహన
సాయకమనఁ బుష్పగంధి సన్నుతి గాంచెన్.

క. మొలకచను మొనలు చెలువపుఁ
గళికలు చరణాధరోష్ఠకరతలములు కెం
దలిరులు కురు లలికులముగఁ
గలమోహనలతిక పుష్పగంధి యనంగన్.

క. చిలుకలు మన్మథునమ్ముల
ములుకులు విటజనులధైర్యమూలంబులకున్
.........విరహుల
కళికలు ధరఁ బుష్పగంధికన్నులతలుకుల్.

క. కులమును గుణమును రూపును
గలిగినబాలికకు విద్య గలిగినయేనిన్

తలపఁగఁ బసిఁడికి వాసన
కలిమియుఁ జెఱకునకుఁ బండుఁగలుగుటగాదే?

వ. మదనసేన విద్యానిధియను నాచార్యునొద్దఁ
దనముద్దుపట్టిం జదువంబెట్టిన నయ్యాచా
ర్యుండును;

సీ. బాలిక కక్షరాభ్యాసంబు గావించి
వర్ణక్రమంబుల వరుసఁ దెలిపి
బహువిధస్తోత్రముల్ పాఠంబు గావించి
వివిధకావ్యంబుల వినికిఁ జెప్పి
శబ్దప్రపంచంబుజాడ యెఱిగించి
సంధిసమాసాదిసరణిఁ జూపి
నాటకాలంకారనైపుణి సూచించి
చిత్రాశుకవితాప్రసిద్ధి గరపి
యఖిలశాస్త్రపురాణేతిహాసమహిమఁ
బ్రోడఁగాఁ జేయుటయు నంతఁ బుష్పగంధి
మలహణుఁడుఁ దానుఁ గూడి సమ్మద మెలర్పఁ
జింతనలు సేయుచుండ్రు నిశ్చింతతోడ.

క. నరికిని జేసికిఁ జదువుచు
నిరువురుఁ గవగూడి తిరుగనేర్చిరి విద్యా
వరనీతి నాఁడు నాఁటికి
సరసైకజనానురాగసమ్మదలీలన్.

చ. పలుకయుఁ బుస్తకంబులును
బట్టుకొ యింటికిఁ బుష్పగంధి రా
మలహాణుతల్లి దండ్రులును
మచ్చిక రెట్టిగఁ గన్య వానితోఁ
జెలిమికి వచ్చె నంచు దయ
సేయుచు వారివచోనిగుంభనల్
పలుమరు నింపుతోఁ జెవుల
పండువుగా వినుచుందు రెంతయున్.

క. మలహాణునిం దమయింటికిఁ
బిలుచుకొ కొనిపోయి రత్నపీఠిక మీఁదన్
నిలిపి తగఁబుష్పగంధియు
నలరఁగ సద్భక్తిఁ జేయ ననుమోదించున్.

క. ఆలోనఁ బుష్పగంధిని
జాలకుఁడను నటుని యొద్ద సాముస కిడిరన్

మేలైన నాట్యవిద్యయు
బాలిక తగనేర్చి రాజపాత్రం బయ్యెన్.

సీ. మొగవరి కట్టడ మొనవు కోలాటంబు
చొక్కంపు మురువులు చిక్కణీలు
దరవు బారబడు బేసి బహుళ రూపు
బంధురగీత ప్రబంధవితతి
వరుసపద్య దేశిబంగాళంబుకంచి
కొరుతికట్టడబిందుకొటియకాడు
పరశరాముడు వీరభద్రుండు కల్యాణి
చౌ.........మొకతాళి శబ్దమాది
దేశిశుద్ధాంగములయందుఁదీగెబోఁడి
పటుతరంబుగ నిజపాదకటక యుగళి
కఖిలపాత్రమ్ములును బొమ్మలగుచు వ్రేలఁ
బూన్కి వహియింపఁ బొగడొందెఁ బుష్పగంధి.

గీ. సకియ రేపును మాపును సాముసేయు
పగలు రేయును జదువుపై బాళి నుండు
వెలయు సంగీతసాహిత్యవిద్యలందుఁ
గమలలోచన నిస్సీమగా నెఱింగె.

సీ. స్వరమండలంబును జంత్రంబు నొకవేళ
నింపుమీఱంగ వాయించుచుండ్రు
కిన్నర, వీణెయుఁ గేలిమై నొకవేళ
మిట్టిచూతురు జగన్మోహనముగ
సొంపుగా దండెలు శ్రుతిఁగూర్చి యొకవేళ
పదములుఁ జిందులుఁ బాడుకొండ్రు
గీతప్రబంధముల్ కేళిఁ జిక్కణి పంతు
లనుకొందురొకవేళ మనము లలర
నార్యహర్తంబులును జూర్ణికావళియును
మక్కువలరంగ రాణింతు రొక్కవేళ
మంజరులు ద్విపదలును సమంజసముగఁ
జదువుకొనుచుందు రొకవేళ సరసలీల.

వ. ఇట్లు మలహాణపుష్పగంధులు బాల్యస్నేహం
బునం గూడి చరియింప నెలప్రాయంబు
దోతెంచిన.

చ. ఒనపరిలాగు బాగు సుగు
ణోన్నతి రూపు విలాసరేఖయుఁ
రసికత పెంపు విద్య చతు
రత్వముఁ గాంతియు దివ్యతేజముఁ

బిసరుహాసూతి యాతనికిఁ
బేర్కొని మక్కువ నిచ్చెఁగాక నాఁ
బొసఁగునె మ్హాణుండు నృప
పూజితుఁడై నవయౌవనంబునన్.

సీ. రమణి చన్నులుచేసి రాలినరజముతోఁ
గమలసంభవుఁడు జక్కవలఁ జేసెఁ
జెలువ కొమ్ముడిచేసి చిందినకప్పున
మెఱసి విధాత తుమ్మెదలఁ జేసె
మగువకన్నులు చేసి మిగిలినతళుకుల
నలువ క్రొమ్మెఱుఁగుఁ దీగలను జేసె
సతినెమ్మొగముఁ జేసి జారిననునుకాంతిఁ
బరమేష్ఠి నిండుచందురునిఁ జేసె
పడఁతి తనువల్లిఁ జేసి త్రోవడినతావిఁ
గనకగర్భుండు పుష్పవాసనలఁ జేసెఁ
గాక లేకున్న నీసొంపు గలుగు టెట్లు?
కమలగంధులలోఁ బుష్పగంధి దనరె.

✓సీ. పటుమోహనస్ఫూర్తి పాలిండ్లు పాలిండ్లు
నుడురాజవైభవ మోము మోము

పంకజంబులతుదిపదములు పదములు
కొదమతేటులకును గురులు కురులు
పసగల కపురంపుఁబలుకులు పలుకులు
ముద్దుకెంజిగురాకుమోవి మోవి
సొగసు వెన్నెలసొంపునగవులు నగవులు
హరిమధ్యమనఁ గౌళికౌను కౌను
మారుతూలికరీతిఁ జెన్నారు నారు
కంబువునకంటె మహిమ పెగ్గలము గలము
వజ్రములకును లేదు పల్వరుస వరుస
యనఁగ నుతికెక్కె రామ లోకాభిరామ.

వ. ఇట్లు మ్లానపుష్పగంధులు వనయానవారం
భంబున.

సీ. శారదచంద్రుండు చంద్రికయునుబోలె
లలి నొక్కటొక్కటికై చెలఁగి చెలఁగి
ప్రసవబాణుండును రతిదేవియునుబోలె
భేద మించుక లేక బెరసి బెరసి
యమరచందనము విద్రుమవల్లియునుబోలె
నన్యోన్యవైఖరి నడరి యడరి

వరవసంతుండును వనలక్ష్మియునుబోలె
భావంబు లేకమై పరగిపరగి
తోడునీడయుఁబోలెను దొరసిదొరసి
తనువు ప్రాణంబుఁబోలెను దనరితనరి
లీలఁ గలనైన బెడబాయఁజాల రెందు
మలహణుఁడుఁ బుష్పగంధియు మరగి యెపుడు.

సీ. విద్యలు గని చొక్కు వేడుకఁ గొన్నాళ్లు
కొనియాడు వేడుకఁ గొన్నినాళ్లు
ఇహముఁ బరంబని యెంచును గొన్నాళ్లు
కూటువమేలనుఁ గొన్నినాళ్లు
ఇద్దఱివయసులు నీడను గొన్నాళ్లు
నన్నలుచూచును గొన్నినాళ్లు
వెడలుచో మూతులు విరుచును గొన్నాళ్లు
కూళపాఱుండనుఁ గొన్నినాళ్లు
భూసురుండగు మలహణుఁ బుష్పగంధిఁ
గూడనిచ్చుట గాదనుఁ గొన్నినాళ్లు
మహితమాయాకళాధాన మదనసేన

... ... ... ...

వ. అంత నప్పురంబునంగల విటవిదూషక ప్రేష్య నాగరికాదులు మలహాణపుష్పగంధులయన్యో న్యానురాగంబులు దలంచి యిట్లని వితర్కిం చిరి తమలోన.

క. కూడం జదివినకతమునఁ
జేడియ కితనికిని గోర్కి చేకూరె నిఁకన్
ఓడన్ గట్టిన దూలముఁ
జాడ సుమీ చిత్తగతులు చర్చింపంగన్.

క. చిన్నప్పటిప్రేమంబును
గన్నెతకపువిటునిమీఁదికాంక్షయు మనుజుల్
గన్నప్పటి చనుప్రేమయు
నెన్నఁగ మదిఁ బాయకుండు నింతుల కెందున్.

చ. చెదరనియట్టికోరికలు
జెందిలినొందనియట్టి వేడ్కయున్
వదలనియట్టి కాంక్షలును
వన్నె దొరంగనియట్టి సొంపులున్
గొదవపడనట్టి బాగులును
గొండికప్రాయమునందె కల్గి యా

మదవతిఁ బాయఁడెన్నఁడును
మల్లణుఁ డెంతటిభాగ్యవంతుఁడో?

సీ. కోర్కెమై దీనితోఁగూడియుండగలేని
నరుఁడు దా నరుఁడె వానరుఁడుగాక
యెప్పుడు దీనితో నెనసియుండనిమేను
మేనౌనె మఱి దారుమేనుగాక
వెస దీనిపలుకులు విన లేనిచెవులు దాఁ
జెవులె చాటనములచెవులు గాక
సరసంబుగా దీనియురముపైఁ జేర్పని
కరము దాఁగరమె కక్కరముగాక
దీనియధరామృతముచవు లాన లేని
జిహ్వ జిహ్వయె శూర్పంపు జిహ్వగాక
దీని గూడనిదినములు దినములౌనె
గణనకును దుర్దినంబులు గాక యనుచు.

సీ. చిత్రోపధానవిచిత్రవితానాదు
లలవోకఁ గానుక లంపువారు
చీనిచీనాంబరశ్రేణు లూరకయని
యర్పించి మీవార మనెడువారు

ఘనసారచందనకస్తూరికాదులు
పోఁబోఁగొనియిచ్చి పోవువారు
ఘనవజ్రతాటంక కాంచీకలాపంబు
లింద, కొమ్మని వేఁడ్క నిచ్చువారు
మధురఫలములుఁ బుష్పముల్ మక్కువలర
నూరకైనను గొనివచ్చి యొసఁగువారు
నైరి యప్పుష్పగంధివాహ్యాళిఁ జేసి
యఖిలజనములు మనముల హర్షమొదవ.

సీ. ముద్దియలావణ్యమునకు సంతోషించి
మెచ్చుచుఁ గ్రుక్కిళ్లు మ్రింగువారు
కనుకని చేఁ జిక్క మనసు దీయఁగలేక
దినమును వెనువెంటఁ దిరుగువారు
పనుపు నెపంబున బాలఁ జేరఁగవచ్చి
వాపిరి నరుసుకొ పోవువారు
శృంగారపద్యముల్ చెప్పించి తముదార
సారెసారెకు వినఁ జదువువారు
దూరమున నుండియైనను జేరవచ్చి
సొమ్ములును వన్నెసవురులు చూపువారు

పొలఁతిఁ దలపోసి యటమీఁదఁ బొగులువారు
నగుచునుండిరి మానవు లప్పురమున.

వ. అంత నమ్మదనసేన పరిజనంబులతోడ మల
హణునివేదించి యిట్లనియె.

సీ. మొండితొత్తులమారి లండుబకంకంబు
అంకెత సారంబు పెంకె గడుసు
పడుచు టక్కులదొంగ బడుగిడు ననుగంటి
బైసికొక్కెర బొంత పచ్చిలంజె
కక్కురంబుల గాచి కసుమాల మిబ్బంది
పీచి వాపేభ్యంబు వేరుపురుగు
ముక్కున్నసబ్బందు ముక్కిడి తాటకి
ద్రిమ్మరి చాడియు దేశకూళ
పుల్లెదాల్పరి మతిగొట్టు ముల్లెవిడుపు
దాటదీపరి ఖోదుదిదాట్లగుళ్ల
దుక్కిపిట్ట పిసాసంబు దోమ తిండి
యితనిఁ బేర్కొని పలుమాట లెన్న నేల.

చ. ఎక్కడి బాపనయ్య, యితఁ
డెక్కడ వచ్చుచున్నవాఁడు దా

నిక్కమె సాధుఁబోలి తన
    నెయ్యముఁ దియ్యము చాలుఁజాలు నీ
చక్కటిఁ జేరనీయకుఁడు
    జాడఁ జలింపగ నీకుఁ డెంతయుం
వెక్కసమైన చేత లివి
    విన్నను నామదిఁ గోపమయ్యెడున్.

వ. అనుటయు సమ్మాటలు మఱి వాణపుష్పగంధు
లు విని తమలో నిట్లనిరి.

క. పురజనము లాడువార్తలు
పరిజనములు పోవుపోక బాంధవసఖసో
దరజనవీక్షణములు
దరమిడి గుండియలవేఁడి తాఁకై యంతన్.

ఉ. ఎవ్వరిఁ గీడుపల్కితిమొ
    యెవ్వరిఁ జూడఁగ నాడినారమో
యెవ్వరి దూఱుచేసితిమొ
    యెవ్వరిమేలు సహింపమైతిమో
యెవ్వరి కొగ్గొనర్చితిమొ
    యెవ్వరి నెవ్వరిఁ బాపినారమో

యిన్విధి వట్టిరట్టు పడ
నెట్టుగఁ జేసె విధాత యక్కటా!

క. నోడిమలకుఁ గలవి లేనివి
గోడిమలుగట్టుచును జనులు కుడువనినోళ్లన్
గుడుపుచుఁ బోయెద రూరకె
ముడుగడలును జెరువుమాయమూఁకుడుగలదే?

చ. అనుజులుఁ దల్లిదండ్రులు ని
జాప్తులుఁ బౌరులు బంధుకోటులున్
బనివడి యేనిమిత్తమునఁ
బల్కెడ రిందఱుఁగూడి వేడ్క నె
మ్మనమునఁ గల్గి సిగ్గువడి
మానితి మింతియకాక కల్గినన్
మనముల రట్టుచేసి యిఁక
మాన్పఁగఁ గర్తలె యెన్నిభంగులన్.

వ. అని యిరువురు నన్యోన్యానురాగసుఖంబులం
దనరుచుండి రంత నప్పురంబున.

మ. కరుణాంభోధి సమాన మానవిలస
త్కల్యాణ కల్యాణభూ
ధరధైర్యాస్పదచిత్త చిత్తజవసం
తస్వాంతభూరికృపా

కరసౌందర్యవిశేష శేషకటకా
కల్యాంఘ్రి పద్మార్చనా
పరమప్రీత్యభిరామ రామయతపః
ప్రాగల్భ్యలబ్ధోదయా!

క. డిండీరహార సురవే
దండసుధాకుందబృందధావళ్యయుతా
ఖండతరకీర్తి వైభవ
చుండిస్థలకరణచంద్ర శుభగుణసాంద్రా!

మాలిని :
సరసగుణసముద్రా సంతతౌదార్యముద్రా
గిరిశచరణభక్తా కీర్తికాంతానురక్తా
తరణిసదృశతేజా ధన్యవాగ్జాలభోజా
దురితచయవిదూరా ధూర్తశిక్షావిహారా!

## గద్యము

ఇది శ్రీమత్సకలసుకవిమిత్ర, సోమయామాత్య పుత్ర, సరసకవితాధుర్య, మెడపాటి యెఱ్ఱనార్య ప్రణీతంబైన మల్హణచరిత్రంబను మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

---

శ్రీః

# శృంగార మల్హణచరిత్ర

## ద్వితీయాశ్వాసము

---

శ్రీమహిత వేద్యవాటిపు
రీమందిర భవ్యరూపరేఖాస్పద సౌ
త్రామసమ విద్యమాంబా
కామిత సాంగత్య చుండికాళామాత్యా.

వ. అవధరింపుము.

క. ధనపాలుండను వైశ్యుని
తనయుఁడు ధనదత్తుఁ డపుడు తనచెలికానిన్
బనిచెను బుష్పసుగంధికి
నొనరఁగఁ గన్నెరికమునకు నొడఁబరపింపన్.

క. నిలువెం డర్థం బడిగినఁ
గలఁగక యొడఁబడుము నాకుఁ గలవాఁడవయో

చలికాఁడ, మెచ్చు నీకుఁ
గలదని నను మదనసేనకడకును నతఁడున్.

గీ. ఏఁగి పుష్పగంధి యిందీవరేక్షణ
చదువ నాడఁ బాడఁ జతుర యనఁగ
దగిలి చూడఁ బంపె ధనదత్తుఁ డనవుడు
మొరటు మాటలకును ముదముఁ బొంది.

సీ. అతని సన్మానించి యర్ధాసనమునకుఁ
జేరంగ దీసి పైఁజేయివైచి
కర్పూరతాంబూల గంధపుష్పాదులు
నయమార నిచ్చి లేసగ వెలర్పఁ
దనముద్దుపట్టిముందటఁ బెట్టి యిబ్బాల
తగునయ్య, ధనపాలతనయునికిని
నతనికేఁగాక యీయరవిందలోచన
యితరమానవులకు నేలనబ్బు
ననిన నిర్వోఁడర్థ మడిగిన నోడఁబడు
మనుచు నంపె నన్ను నతివ, యిపుడు
అడుగు మేమియర్థ? మతనికి నిమ్మేలు
వార్త వేగఁ జెప్పవలయు ననిన.

క. రాజా, రాజులు బ్రాఁతే
రాజులుధనపాలసుతుఁడు రాగుందు...వె
రాజు మగఁడైన నేలా
గాజుంగడియంబు కడమగలదే యెందున్?

క. చతురుఁడు ధనదత్తుఁడు గడు
నతఁ డొసఁగెడు విడెమె చాలు నన్యము లేలా?
బ్రతికితి భాగ్యము సేసితి
నతివేగమె పొమ్ము తెమ్ము నల్లునిగాన్.

వ. అని మదనసేన యతని ధనదత్తుకడ కనిపి తన ముద్దకూఁతుం దొడలపై నిడుకొని బుజ్జగించి బుద్ధిగా నిట్లనియె.

క. వయసు గలనాఁడె యర్థము
నయమున నార్జింపవలయు నానాభంగిన్
వయసుడుగ నుడుగు గడనయు
వయసే ధనమూలమండ్రు వారాంగనకున్. ✓

క. ఊరకపిలిచేమన్నను
రారెవ్వరు తలకు నరులురాఁ జూచిరయో
యారయ నెంతటివారికి
గారవ మది దీనికంటెఁ గష్టముగలదే.

క. కోఁతల గీతల వెల్లల
రోఁతలకును మూలమగుచు రూపఱి మిగులన్
బ్రాఁతిచెడు ముదిసెనేనియు
లేఁతప్పాడె లంజెయున్కి లెస్సైయుండున్.

క. తలనరసిన ముదివిటులును
గులహీనులుఁ గుండగోళకులును గురూపుల్
కలిమిఁ గలవారలైనను
వెలయాండ్రను నెపుడుఁ బ్రోచు వేల్పులుగాఁకే.

క. బొజ్జలు పెరిఁగిన సెట్లు
నొజ్జల్లును దడిక ద్రోపు లొంటరికాండ్రున్
లజ్జయెఱుంగని విటులును
సజ్జకముగ వారనతులజన్మఫలంబుల్.

క. చక్కనివారలు జారులు
కక్కసమగువారు వన్నెకాండ్రున్ రసికుల్
చొక్కమగు రాకుమారులు
మిక్కిలి వెలయాండ్రపాలిమృత్యువు లరయన్.

క. రొక్కము ధనమీఁగలిగిన
మిక్కిలియుఁ గురూపిమైన మెచ్చఁగవలయున్

తెక్కలియై ధనమీయని
యక్కాంతునినైనఁ గదియ నర్హంబగునే. ✓

క. డెందం బేరికి నీయక
యందఱఁ దనయాత్మలోన నడపుచు నయనా
నందంబుగ మెఱయఁగవలె
నందంబున వారకాంత లద్దము భంగిన్. ✓

చ. బలపము లేఁతనవ్వు, నును
బయ్యెద సన్నపుఁగావిచీర, మిం
చులుగొను జల్లిజంపునును
జూడ్కియె కన్నపుఁగత్తి, మోవి తీ
పలవడఁ జొక్కుచుణ దగ పి
టావలి డెందముఁ గన్నపెట్టి యిం
పుల ధనమెల్లఁ దీసికొని
పోవలెఁ గామిని గండిదొంగయై. ✓

క. మగవానిచిత్త మంతయు
నిగురొత్తఁగఁ జేసి వేఁటయిఱ్ఱియపోల్కి
దగిలింపక తాఁదగిలిన
మగువెంతయుసొంపుచెడియమాన్యతనొందున్.

క. వలచుటకష్టమువనితల్
వలచుటపురుషునికిఁ గాక వారాంగనకున్
వలపు దగ దెన్నిభంగుల
వలచినయెడ విఱుగనేర్పువలెఁదరుణులకున్.

క. గరగరికలేనిపట్టులఁ
బరికింపుచుఁ గల్లకీసుభావించుచు మై
నెరసులు వెదకుచునుండెడి
పురుషునిపైఁగూర్మి వీటిఁ బోవదె సతికిన్.

సీ. పురుషుని నెచటికిఁ బోవంగనీయక
వింతచేఁతల గురివేయవలయు
నవనవసురతతాండవసౌఖ్యవార్ధిలో
ముంచి యింపులఁ బొదలించవలయుఁ
గలసినయప్పుడు వలచినయట్లుండి
యెనసి వేడుకఁ జిత్త మెఱుఁగవలయు
మందుమంత్రంబులు మాయలు ప్రతివన్ని
తెగువమై నవలీలఁ దిరుగవలయుఁ
గలసినప్పుడు చనవిచ్చి కలయవలయు
పాయునప్పుడు నిచ్చయు సేయవలయు

నయముఁ బ్రియమును దప్పకనడవవలయు
నమ్మికలుగాఁగఁ దగవులు నడపవలయు.

వ. అనియిట్లు మదనసేన తనకూతునకు బుద్ధి చెప్పుచునుండెనంత వసంతాగమం బేతెంచిన.

ఉ. వచ్చె వసంతుఁడంచుఁ బ్రియ
వార్త యొకింత యెఱుంగఁజెప్పినన్
మెచ్చి సమీరచారునకు
మెప్పుగ నవ్వనదేవతాంగనల్
మచ్చికఁగట్టువర్గము స
మర్పణచేసిరో యంచు భూజనం
బచ్చెరువందఁగాఁ దగుల
యాకులు డుల్లెఁ గ్రమక్రమంబునన్.

చ. లలితలతావగూహనము
లం బులకించినరీతిగప్పులున్
బలియుచుఁ బల్లవించె నటఁ
బల్లవముల్ తళుకొత్తి యొప్పుమై
నలి సుమనస్స్థితుల్ గనియె
నాసుమనస్స్థితిఁ జెంది యంతఁగో

౨౦ శ్రీ కృష్ణ దేవరాయ ఆంధ్ర భాషానిలయము,
విభాగము ..... (ప్ర). సంఖ్య ....
విభా ...

ర్క్యాలుఫలియించె నాఁగను ద
రుప్రకరంబు ఫలించె నెంతయున్.

సీ. సాలరసాలరసాలసాలంబులు
కోలకంకోలతక్కోలములును
చాంపేయచాంపేయచాంపేయనికరంబు
కేసరకేసరకేసరములు
మరువకమడువకమరువకానీకంబు
పాటలపాటలపాటలాలి
కురవకకురవకకురవకానీకంబు
కాంచనకాంచనకాంచనములు
చందనద్రుమచందనచందనములు
దారుదారుకసద్భద్రదారుసమితి
మాలతీకృతమాలతమాలవితతి
తాలహింతాలతాలలతాశ్రైక
వనము లింపారె భువనపావనము లగుచు.

చ. అలికలకంఠగానము శు
కారవగుంభితతాళమానముల్
కలరవహంసకేకిరవ
కాహళమర్దళతుండికాధ్వనుల్

చెలఁగఁగ గాద్భున ర్తనము
   చేయఁగఁ బుష్పాదిరంగవల్లికల్
వాలిచిన నాట్యశాలలనఁ
   బొల్పగుఁ బూఁబొదరిండ్లు సొంపునన్.

వ. తదవసరంబున.

క. దండిగ మన్మథునగరికి
దండుగ లొడఁబరుపుంజెతల్లులెదొరలై
మెండుగ విఱుగఁగ వచ్చెను
బండుగదుర్దిఁటులు బండుబండుగ నంతన్.

సీ. అల్లువారలఁ దమయాఁడుబిడ్డల నొగిఁ
   బట్టిండ్లకును గొంపోవువారు
తైలాజ్యగుడదుగ్ధతండులానీకంబు
   నాశ్రితులిండ్లకు నంపువారు
హితభృత్యసఖబంధుసుత దారలనుగూడి
   యభ్యంగములుదీర్చి యలరువారు
దానధర్మపరోపకారానుబుద్ధిఁ
దవిలి భూసురసంసేవఁ దనరువారు

వరదుకూలవిభూషణావలి ధరించి
మెండుకొని వీథులందును మెలఁగువారు.

సీ. వెచ్చానకేమైన విస నియ్యఁబడియెడు
నని పుల్లదీగెల కలుగువిటులు
తొడవులు దొడఁగట్ట నెడలేక బెదరక
యెరువుసొమ్ములు పెట్టి తిరుగువిటులు
వెడలఁ ద్రోపులుపడి వెస నేమియును లేక
చోరఁజోరవిద్యకుఁ జొచ్చువిటులు
నభిమతార్థము లిచ్చి యన్యోన్యలీలల
నువిదలఁ బెడఁబాయ కుండువిటులు
మాడలనిచూపి భ్రమయించి మతముఁ బన్ని
సుదతులకు రిత్తమాటలు చూపువిటులు
గణనకెక్కిన తత్పురాంగణమునందు
మెలఁగు చుండంగఁగడువింత చెలువు దోఁచె.

వ. అంతనటయున్న మొరటుండును మదనసేన
వీడ్కొని సంభ్రమంబున.

క. చని వేగమె ధనదత్తునిఁ
గనుఁగొనుటయుఁజూచియతఁడు కాయయొపండో?

యన మొరటుండని యెను దాఁ
బనివినగా యానె యెప్పుడుఁ బండే కాదే.

వ. అనినఁ గౌఁగిలించి మెచ్చుమిగ్గుమీాయని యొక గొంటుపోక విడియం బతనికిం బెట్టి యిట్లనియె:

గీ. అత్త యేమియనియె నాపడు చేమనె
నీవు నేమియంటినిక్కువముగఁ
బౌరు లేమియనిరి పరికింప వారింటి
చేటు లేమియనిరి చెప్పుమనిన.

క. ధనదత్తుఁ డనినమాత్రనె
విని సంతసమందె నత్త వేడుకపడుచున్
గనుమూసియుండె సిగ్గునఁ
జనులకు బరిజనుల కాత్మ సమ్మతమయ్యెన్.

క. విను మేమిటి కాలస్యము
నినుఁ దెమ్మనె మపననేన నేఁటిముహూర్తం
బునఁ బుష్పగంధి నిన్నును
నెనయఁగ సమకూర్పమంచిదెంతయు ననుచున్.

క. మున్నాదిసరకుజడ్డలు
గొన్నఁ లాభించుఁ బిదపఁ గొనఁ జేకురునే
యెన్నంగ నదియు నిటు లే
యెన్నైనను గలయ నిచ్చుటింతయు లెస్సఁ.

వ. అని యిట్లుండ వెనుక నన్ను దూరం బని లేదు మదన సేన ప్రభావంబు సూచించెద నాక ర్ణింపుము.

క. ఆతెఱవ యాగ్రహించిన
భూతంబులునొచ్చుఁజిచ్చుపొలయుఁగ వెఱచుఁ
జేతనసంభవమాయా
కౌతుకవిద్యావిభేదకారిణి యగుచున్.

సీ. నేలకు నింగికి నెఱయఁదాఁపలు పెట్టు
చెలరేఁగి రోఁకటఁ జిగురుఁ గోయుఁ
గడు బట్టతలలు మోఁకాళ్లను ముడివేయుఁ
గొనరక వడగంప్ల గుళ్లుగట్టుఁ
బూన్కిపై నంగళ్లఁ బాలిజున్ను లమ్మించు
నయమునఁ జట్రాత నారఁదీయు

నొండొండఁ గొండలు గుండుగాఁ దాఁకించు
వదలక నడురేయిఁ బగలుసేయు
రూఢి మెఱయంగ నిసుమునఁ ద్రొడుఁ బేను
లెక్కసేయక చుక్కల లెక్కపెట్టు
గాలిఁ నొడిఁగట్టు మంచుఁ గుంచాలఁ గొలుచు
మదనమాయాకళాధాన మదనసేన.

సీ. వెడవెడ వలపులు వెదచల్లి దొరలచే
నడియాలములు దీసి కడకుఁ దొలఁగు
ననుపువారలఁబట్టి పెనుబులుపై బట్టి
ధట్టించి నగరెక్కి ధనముఁదివియు
పెంపుడుగున్నల పెద్దశృంగారించి
వింతవారలఁగని వెఱ్ఱిగొలుపు
ధనికులకడ కేఁగి తనసొమ్ము వారొద్ద
బోయెనంచేమైనఁ బుణికికొనును
గోరి తనకును లోనైనవారి నెల్ల
బనికిఁ బాటకు బంట్లకాబల్లిగట్టి
క్రొత్తవారలఁగనుఁగొన్న నెత్తుసేయు
మాటలనె తీయు ధనమెల్ల! మదనసేన.

వ. అని మొరటుంపు చెప్పిన మాటకు నవ్వి ధన
దత్తుండు తన తెఱంగు వినుమని యిట్లనియె.

సీ. దైవాలకును రిత్తదండాలు గిండాలు
గాని యెన్నఁడు నొకకాసు నీయఁ
గవిగాయకులు వచ్చి గణుతించి వేఁడిన
వదలిపోవుటెకాని పైక మియ్యఁ
జుట్టాలకును వట్టిసుద్దులు ముద్దులు
గాని యెన్నఁడును డగ్గరఁగనీయఁ
బైత్రోవవచ్చిన పరదేసియొరదేసి
మోసపుచ్చుటెకాని గాసమీయఁ
బట్టఁకొని బందికాండ్రను బాధపెట్టఁ
బెంచులే చూప నొకబలుపీసమైన
బ్రహ్మరాక్షసిశాకిని బ్రతిదినంబుఁ
గూఁతలేకానిముద్దెఁడుకూడుపెట్ట.

సీ. మునుపు దొంగలకుఁబోయిన గొడ్డులే కాని
తగిలి బాపలకు గోదానమీయ
కొఱమాలి ముఱిగిన కూష్మాండములె కాని
దాక్షిణ్యమొదవంగ దానమీయ

పెనుదొడ్డుపెసలు ముక్కినబియ్యమే కాని
యంగళ్ల నమ్మింతు సనువు లెఱిఁగి
వడ్డికాసులు గూర్చి వడ్డి కవియె యిచ్చి
పొరుగిండ్లవంకి నేప్రొద్దుఁ బోదు
ఈఁగకై బలి యెన్నఁడు నీయకుండు
పాముకై బలిపెట్టను బ్రతిభ త్రోఁడఁ
గదిసి యెంగిలిచేతను గాకి నేయ
నెరయ నాజాడ నెవ్వఁడు నెఱుఁగరోయి!

క. విను మాటలె పచరింతును
ధన మప్పుగ నిత్తుఁ బిదపఁ దగులందీతుణ్
ధనదత్తుగాని నేఁతలు
వినరా యెవ్వారు నీకు వింతయె మొరటా!

వ. అని నీవుపోయివచ్చిన ప్రయోజనంబులకుఁ బో
రానిపక్షంబైనఁ జూచుకొంచమని నిజనివాసం
బునకుం జని యప్పుడఁతిం దలంచి నిలుకాల
నిలువ సహింపక డోలాయమానమానసుం
డై యప్పుడు.

గీ. బేరసారంబుమీఁదటి ప్రేమ లుడిగి
సెట్టిసానివిలాస మీక్షింప రోసి

సత్రసాలయ్యె ముద్దాడఁ బైచఁడమ్యె
వనితమీఁదటి హాళి సకలైశ్వర్యవరుఁడు.

గీ. కాసు విడిచినఁ బ్రాణ మాకసముఁ బట్టు
ముదితఁ బాడక ప్రాణంబు మున్నె పోవు
దెగువ నీ రెంటికిని నేడు తెరువు చెపుమ
పాపి! లంజరికంబ! నీబంటుఁగావు.

సీ. చక్కిలంబులు గొన్ని చవిచూచు సందడ
మెల్లనె యనుఁ గుగ్గిళ్లనములు
చల్లగావలెనని చలిమిడి భక్షించు
నొకపాటుగాఁగఁ బానకముఁ ద్రాగు
నయనపోలయ్యకు నంజలి ఘటియించుఁ
దుంపితీర్థమునఁ గన్నులు దోలించు
తల గోడతోడుతఁ దాఁకించుకొనఁబోవు
పాపిదైవము, యని పండ్లుగొఱుకు
నడిచిపడుఁ బోత్రికము పంతఁ బొడిచి కొనును
మూల్గు నిద్రయు నాహారమును ద్యజించి
యున్నచో నుండ నైనక యొఱలియొఱలి
మొరలు, పోదమురమ్మను ముదితకడకు.

వ. ఇట్లు ధనదత్తుండు మనోజవ్యథ సైరింపలేక తన
నిజసఖుండైన మొరటుం బిలిచి యిట్లనియె.

క. పోకున్న మనసు నిల్వద
యీకుండిన లంజెపిలువ దేలా గిఁకఁ దా
నాకుంగలచెలికాఁడవు
చేకూరఁగ వేగ బుద్ధిసెప్పు మటన్నన్.

కం. మానినిఁ గలయక యింతట
మానిన ననుమానహాను బ్రాణముఁ దనువుఁ
ప్రాణము గలిగిన సకలముఁ
దానూరక గలుగునని ధనదత్తుండున్.

ఉ. పుట్టెఁడు నేయి నూనె పది
పుట్లు సడించిన సన్నబియ్యముఁ
బెట్టెఁడుపట్టుచీరలును
బిందెఁడుమాడలు చాలఁ గ్రొవ్విరుల్
నోట్టునఁ బట్టుగోష్టియలు
నూఱును నేఁబదిసూకరంబులుఁ
బట్టియమంచముల్ పదియుఁ
బంపెను లంజియవారి యింటికిన్.

వ. అంపిన నమ్మదనసేన కన్నుదనిసి తగినచుట్టం
బులుం దానును దనయిలువేలుపులకుం బెట్టు
కొని విభూషణభూషితయై పుష్పసుగంధి
నలంకరించుకొని యప్పుడు.

క. తొలువినికి నభవుముందట
నలికుంతల పుష్పగంధి యాడెడుననుచున్
గలయంగఁ బురములోపలఁ
బొలఁతుక చాటించె దిశలు భోరునఁగలఁగన్.

క. చాటించినఁ బైపైఁబడి
పేటీపేటీలు దొరలు మొలఁతలు విటులున్
గోటానకోట్లు వచ్చిరి
వీటంగలరసికులెల్ల వేడుకఁజూడన్.

సీ. వావికా మధురికా పావకాహాళముఖ
తుండికాశంఖాది తూర్యవిదులు
డమరుగ ఝల్లికాఢక్కాళీమర్దళ
ఝల్లరీఝుంకారచతురమతులు
చిత్రవీణావిపంచీమత్తకోకిల
లావైనకిన్నరలాతుణికులు

ఘంటికాజయఘంటికాకమ్రఘనతాళ
    సప్తపద్యాదిప్రస్తారచణులు
సకలవాచాభినయకళాప్రకటనటులు
గాయకులు నంగనలు నాదిగాఁగఁ గలుగు
మేళములవారిఁ గూడి సమేళమెసఁగ
శంభునగరికి వేంచేసె సంభ్రమమున.

చ. ఉరమున రత్నకంచుకము
    నొప్పులపొడెము వజ్రమౌక్తికా
భరణములుం ధరించి చెలి
    పైఁ గరపల్లవ మల్లిఁ జేర్చి యా
నిరుపమరంగమధ్యమున
    నిల్చెను వేడుకఁ బుష్పగంధి తో
ల్కారిమెఱుపుంబలెన్ జనుల
    కన్నులకున్ మిఱుమిట్లు గొల్పుచున్,

వ. అప్పుడు మల్లిణయు చనుదెంచి యప్పుష్ప
గంధి నాట్యంబు చూచుచుండె నవ్వేశ్యయందు
నొక్కయెడం గనుంగొనుచుండె; నయ్యవస
రంబున.

సీ. శ్రుతులకు నింపుగా శ్రుతికదంబము చేసి
లీలనాలాపనముల్ మేళవించి
మంద్రమధ్యమతారమానంబు లమరంగ
గమకించి నిఖిలతాయములు మెట్టి
షాడవౌడవశుద్ధ సంకీర్ణములు చూపి
వివిధరాగంబులు వేళ నెఱపి
యాహతప్రత్యాహతాదులు నమకొల్పి
స్థానమానంబులు సరణి నిల్పి
తాళమమరంగ నర్థంబు దప్పకుండ
నొప్పి రంజిల్లు రసములు నుప్పతిల్ల
వరుస లేర్పడ నన్నింట నన్నె గలుగఁ
జతురగతులను బాడంగ శంభు నెదుర.

వ. నిలిచి పుష్పాంజలు లిచ్చి ముఖచాతుర్యంబులు నటించి మోహనాలతోటి కూటమిను జన్మ సహస్రంబులకుఁ గలుగజేయుమని యంతర్గతంబునం దలంచి మ్రొక్కుచు.

ఉ. ఇందుధరుండు మెచ్చఁ దర
శేకుణ పుష్పసుగంధి సల్పెవే

ఢక్కాం దగున్నృత్యముల్ మురజ
కాహళమర్దళడిండిమధ్వనుల్
గ్రందుగ నెల్లవారలకుఁ
గౌతుకమీనఁ బదాంబుజద్వయం
బందెలు గల్లుగల్లన వి
టావలిగుండెలు జల్లుజల్లనన్.

సీ. చారణబాగడచర్చరీబహురూప
దండలాసాదికభాండికములు
కందుకకోలాటకానాట్యతాసఖ
ప్రేరణకుండలిప్రేక్షణములు
సూతముల్ పుహుఁడకశుద్ధపద్ధతి చిత్ర
పద్ధతి ఘనదేశపద్ధతులును
కైలాటలంబకకరణైకతాళికో
లాసాదిగీతహల్లీసకములు
నాదిగాఁగల్గునృత్యనృత్తైక్యముఖ్య
నాట్యవిధములుసూచించినయమెలర్ప
జనులకెల్లను లోచనోత్సవము గాఁగ
నాడె నాయిందుముఖి కొనియాడె జగము.

వ. ఇట్లు పుష్పసుగంధి నృత్యంబునల్పుటయు నద్దేవదేవుస్థానికులు దొరలు పౌరులు కనకాంబరాదు లపరిమితంబుగాఁ గట్టనిచ్చిన మేళంబులవారుం దానును నందుకొనుచు నుత్సాహంబున మదనసేన నిజనివాసంబున కరిగినఁ దక్కినవారలు యథేచ్ఛం జనిరి. మలహాణుం డప్పుష్పసుగంధిహృదయంబుఁ దెలియం దలంచి యద్దేవదేవుని యుద్యానవనప్రాంతంబునఁబథంబుఁగాచుకొనికనుమఱుఁగున నుండె నప్పుష్పసుగంధి మలహణుంజూచు వేడ్క భానుమతియనుచెలియుం దానును నొక్క వటవిటపిప్రదేశంబున నిలిచి నిట్టూర్పు నిగుడించుచుఁ దమకులంబు నిందించుచు దుఃఖావేశంబున నిట్లనియె.

క. ఎఱుకలు మాలిన యేభ్యపు
మొఱకులుగ డునోసఁగుదానములు నతికష్టుల్
పఱిచినపాటులఁ బడిపడి
నరమగువేశ్యలకు వేఱునరకము గలదే.

క. ఢొల్లంబొట్టయువంకర
కాళ్లను బెనుగొలుఁబెలుచఁగలధనదత్తుం
జెల్లంబో కని యెవ్వరు
నుల్లంబున నోకిలించకుందురె చెపుమా.

క. నేనెక్కడ తానెక్కడ
నానోముఫలంబుగాక నాకుం దనకుఁ
మానుగఁ బొందిక లేదా
ప్రాణసఖి, యింతకింతెఁ బాపము గలదే.

ఉ. వేయును నేల నామనసు
వేడుక మ్మాణుమీఁదఁ గాని యో
తోయజగంధి, యన్యునెడఁ
దూకొని రోయుచునుండు నందన
చ్ఛాయలఁ గల్పకప్రసవ
సౌరభమానుచుఁ జొక్కి మక్కువం
బాయని తేఁటి హేయమగు
ప్రబ్బలిపూవుల కాసనేయునే.

క. తొలిఁదొలిఁగోమటిముఱికిం
గలిసిన నరకాబ్ధిఁగూలఁగలుగుట కాదే

చెలియా, పిలుచుకరమ్మా
మలహాణిముఖి మైనఁ జూతు మనసారంగన్.

వ. అనుటయుఁ దత్ప్రాంతంబుననున్న మల
హాణిండు చిఱునవ్వానవ్వుచు నరుగుదెంచినిల్చి
సంజూచి పుష్పగంధి యతనినప్పటి చెఱంగుఁ
గరంబునం జుట్టి పట్టుకొని యిట్లనియె.

క. ఇందఱవు నెందు నుండితి
విందుముఖుల్ రాఁగఁ జూడ నేఁగితివో నే
నిందరసి నిన్నుఁగానక
కుందఁగ మది నీవు డాఁగికొనఁదగవగునే?

వ. అనిన నమ్మలహాణుం డిట్లనియె.

ఉ. ఓ చపలాక్షి, యోయబల,
యోయలికుంతల, నీకుఁగాన నేఁ
గాచుకయున్న వాఁడ నిదె
కౌఁగిటిలో నను గారవించవే
పూచిన మావిమోకకడఁ
బొంచుక మర్మము లంట నేయుచున్

ఏచిన పంచసాయకుని
యిమ్ము దొఱంగదు కంటె దూరఁగన్.

సీ. కలకంఠకంఠి, నీకన్నులు చాలవే
యవలీల భువనత్రయంబు గెలువ
పద్మాయతాక్షి, నీపలుకులు చాలవే
సరసులహృదయంబుఁ జల్లఁజేయ
కాంతాలలామ, నీకన్నులు చాలవే
దేవేంద్రభోగంబు ధిక్కరింప
కిసలయపాణి, నీకెమ్మోవిచాలదే
నయమునఁ బ్రాణదానంబు సేయ
నాతి, నీపొందు చాలదే నాకు నిపుడు
నంచితానందసౌఖ్యంబు లందఁజేయ
నితరకృత్యంబు లెవ్వియు నేల నాకు
నిన్నుఁ జూచుట చాలదే నెలఁత, యనిన.

క. రమ్మా మల్హణ, తగునా
యిమ్ముల నను నెరవుచేసి యిట్లాడంగా
నెమ్మనమును బ్రాణంబును
నిమ్ముగ నీసొమ్ముఁజేయు టెఱిఁగియు మఱియున్.

ఉ. ఎవ్వరు చూతురో యనక
యెవ్వరు తల్లికి విన్నవింతురో
యెవ్వరు తప్పనాడుదురో
యీపనికంచుఁ దలంక కెంతయుఁ
మవ్వమెలర్పఁ గౌఁగిటను
మల్లణునిం గదియించి యాత్మలో
నెవ్వగమాన మోవిచవి
యిచ్చుచుఁ బుష్పసుగంధి యర్మిలిన్.

చ. చలి నెడగాఁగ నిల్వుమని
చేరువనున్న లతాగృహంబు లో
పలికిని గొంచుఁబోయి తన
ప్రాణవిభుఁ వనదేవతాంగనల్
నలలితమంగళాక్షతలు
చల్లుచు దీవన లిచ్చుభంగి మా
ఘులఁ బడుపుష్పకేసరము
లుఁ బికరావము లింపొనర్పఁగన్.

క. గొజ్జగిపూఁ బొదరింటను
సజ్జకమగు విరులసెజ్జ సంతస మొదవఁ

లజ్జావతి ప్రాణేశ్వరు
హృజ్జనితవినోదకేళి కెంతయుఁ దార్చెన్.

చ. కరమణికంకణక్వణము
కంఠరవంబులు కాంచికాసము
త్కరమణికింకిణీధ్వని ప
దద్వయనూపురరావ మింపగా
సురతనవీనతాండవముఁ
జూచి మరుండనునోజ ప్రేయు పెఁ
దరువన వేణి వీపునను
దార్కొనె నాట్యపుబొమ్మయో యనన్.

గీ. యువతిసురతవేళ నొప్పెఁ జన్నులకును
మోమునకును నడుమ మురియుసరులు
చంద్రచక్రవాకసమరంబు వారింప
నడ్డగించు తారకాళి యనఁగ.

చ. అనువుల నైనదప్పు లధ
రామృతపూరముచేత నార్చుచుఁ
గినుకలు నింపులుం బెరుఁగఁ
గ్రిందటమీఁదటలై యథేచ్ఛలఁ

దనియక యింతియుం బతియుఁ
దర్పకకేళి సుఖించి రక్తిలిన్
ఎనుబదినాల్గుబంధముల
నించుకయించుకఁ వేడ్కఁ జూపుచున్.

గీ. అంగుష్ఠమఱకాలు నధరమండయుఁ బిక్క
చిఱుదొడయును గటి చెలఁగునాభి
చనుముక్కు వక్షంబు నునుగళంబును జెక్కు
నెమ్మోవి కనురెప్ప నెరులు శిరము
శుక్లపక్షంబున సొరిదిమై నెక్కించి
బహుళపక్షంబునఁ బరగ దించి
పెనఁచి పట్టియు నొత్తి చెనకి రాఁ జికిలించి
కదిమియు నలమియుఁ గరఁచి నొక్కి
త్రిప్పి యూని మోవి తీసియు వేసియు
ననఁగఁ బరగుచున్నయతిరహస్య
మదనతంత్రవిధుల మానినిఁ జొక్కించి
మలహణుండుచొక్కె మక్కువలర.

గీ. గండభేరుండపక్షిసంగతి దలిర్ప
నిటియుఁ బెనఁకువ సందొకయింత లేక

మేనులొక్కటియై మోముఁ గానరాఁగ
నలసి నిద్రించి రింతియు నవ్విభుండు.

ఉ. పల్లవపాణికిం బతికి
 భావజకేళిపరిశ్రమంబులోఁ
జల్లగఁ జల్లగాడ్పు వెద
 చల్లఁదొడంగె రసాలవల్లరీ
తల్లజకేతకీక్రముక
 తామరసాంబు పటీరపాటలీ
హల్లకమల్లికావకుళ
 హాళిసగంధసుగంధవాసనల్.

• చ. ఇరువురు నిద్ర మేలుకొని
 యించుక సేదలు దేఱి వెండియుఁ
సురతవినోదకౌతుకము
 చూడ్కులఁ గ్రమ్మగఁ జుంబనాదులఁ
బరిపరిరంభణంబుల న
 వారణఁ దీరనియట్టి కాంక్షలుఁ
పరిపరిలాగులఁ గలయఁ
 బైకొని వేడుకఁ గూడియున్నెడఁ

క. వెలినుండి యవ్విలాసిని
తలఁకుచుఁ బఱతెంచి యింతతడ విటునిలువన్
మలహాణా, తగునా యనుటయు
వెలఁదుకయును దాను నచట వీడ్కొనియంతన్.

క. అడుగిడుచు మగుడిచూచుచు
నడు గామడగాఁగనలసి యటఁ దొట్రిలుచున్
వడి, నీళ్ల కెదురు నడిచిన
వడుపున నెడఁబాసి చనిరి వనితయుఁ బతియున్.

వ. ఇట్టు లిరువురు నిజనివాసంబులకుం జని తమ
కలయు తెఱం గేరికిఁ దెలివిపడకుండునట్లుగా
మజ్జన భోజనంబులు దీర్చి యెప్పటియట్ల
యుండి రంత.

ఉ. గందపుబొట్టు వీడియముఁ
గచ్చలపాగయుఁ గావిదుప్పటిన్
సందులఁ బూసలున్ జెవుల
చాటున నీలపుదంటపోగులున్
కందినయట్టి వెండిమొల
కట్టును నీలపుటుంగరంబులున్

బాంధవు కిట్టుచెప్పాలునుఁ
బాల్పెసఁగఁ ధనదత్తుఁ డంతయున్.

క. కోమటిజాణలు కొందఱు
నేమాఱును బాడుకొనుచు వెనువెంటను రాఁ
బ్రేమమున నరిగెఁ బిల్లల
తో ముదిపందియునుబోలె దన్నహాలింన్.

ఉ. వచ్చినకూర్మియల్లునికి
వంచనలేక నివాళు లిచ్చి లో
నచ్చెరువుఁ ముదంబుఁదోలు
కాడఁగ గొజ్జఁగినీట బాదముల్
మచ్చిక దూతిక ల్గడుగ
మన్ననదోఁపఁగ మేల్మిపీఠముల్
మెచ్చఁగనుంచి యందఱన
మేళముతోఁ బ్రియమారఁ జూచుచున్.

గీ. కప్పురపువీడియంబును గైరవల్లు
పరిమళంబులు గంధపుష్పములు నొసఁగి
వదన మించుకయెత్తి యమ్మదన సేన
పలికె ధనదత్తుతోడ నుత్కలిక యెసఁగ.

క. ఏకోర్కులు మదిఁ గోరితి
మాకోర్కులె కన్నదనియ నంపితి వకటా,
నీకున్ బ్రతి యిఁక నేఁడీ
మాకున్ దె..........................

ఉ. ఇచ్చితిఁ బుష్పగంధిఁ దర
శేఖరుఁ జక్కని పుష్పకోమలిన్
బచ్చనివిల్తుకేళి నిఁకఁ
బాయకకూడి సుఖింతుగాక పెం
పచ్చుపడంగఁ బౌరజను
లందఱు నచ్చెరువందఁ గోరికల్
పెచ్చుగ నెచ్చరింప మదిఁ
బేర్చి యఖండిత వైభవోన్నతిన్.

సీ. పగడంపుఁగంబాల పచ్చటోవరియును
నపరంజికాళంజి యలరుఁ బాన్పు
బంగారుసకినెల పట్టెమంచంబును
వజ్రాల నునుజాలవల్లికయును
కుంకుమతలగడ గొజ్జంగిపూఁదెఱల్
తరమైన చంద్రకాంతంపుగిండి

చౌసీతిరతముల నవరసనిమేల్కట్లు
　　దీపించుమాణిక్యదీపకళిక
పౌనగఁ గస్తూరివేది కప్పురపుసురటి
నిలువుటద్దంబు రత్నంపు నెత్తపలుక
తళుకు దంతపుఁబావలు కలికిచిలుక
గలిగి యొప్పారుచవికలోపలికి నపుడు.

క. అల్లుం గూతుం బదఁడని
యల్లనఁ దత్పరిజనంబు నంపుచుఁ బలికెన్
మెల్లనఁ జల్లనిమాటల
నుల్లము రంజిల్లఁ గరుణయును వట్రిల్లన్.

క. రసికులరు మీర లన్నిట
పసినిసు విది యెఱుఁగఁజెప్పి పనిగొనుఁ డేమే
విసువక తుమ్మెద యరవిరి
కసుగందకయుండ రసముఁ గైకొనుభంగిన్.

వ.........యతనిం జవికలోపలికిం బొమ్మని విలా
సిని భానుమతి మొదలైన చెలికత్తియలం
గూర్చి పుష్పగంధినుండుమని మదనసేన
యభ్యంతరగృహాంబునకుం జనియె నంత.

క. పెనుగంబంబున కేనుం
గును దార్చినరీతి తాయి గుడిమీఁదికి నో
య్యన నడుపు భంగి సకియలు
వనితామణి.........వైశ్యునికడకున్.

క. చని వాని పట్టెమంచము
కునుసం గూర్చుండి లోనఁ గుందుచుఁ జెలులం
బనులనెపంబున నొయ్యనఁ
గనుసన్నలఁ జీరుకొనుచుఁ గనలుచు నంతన్.

ఉ. చూచెను వాని నయ్యబల
చూపుల వాకొలుపం బిశాచముం
జూచినయట్లు మర్కటముఁ
జూచినపోలిక గొల్లకేతనిం
జూచిన............ముఁ
జూచినకైవడి దుర్నిమిత్తముల్
చూచినలీల హేయమును
జూచినమాడ్కిని జూచి రోయుచున్.

చ. కటకట! పార్వతీరమణ,
కంతుమదాపహా, భక్తలోల, నీ

కిటు తగునయ్యా, నాడు హ్రాద
యేశ్వరు మల్హాణు భావ మిమ్మిది
స్ఫుటగతిఁ దొంటిజన్మమునఁ
బూజయొనర్పక యుంటినో సుమీ,
..........................బడఁ
ద్రోచితి నన్ దయలేనివాఁడవై.

క. కలుషాత్ముల నతికష్టులఁ
గలవారలఁ జేసి పాపగాంభీర్యదయా
కలితులఁ బేదలఁ జేసెడి
పలుమరువుగఁ బెట్ట నీకుఁ బాడియె రుద్రా!

క. ధనదత్తుఁ డగుట వానికి
నను నమ్మను మదనసేన నయనిధికి మహా
ఘనకీర్తికి మలహాణునకు
ధనమీయక పెద్దసేయఁ దరమె మహేశా.

క. ..............లూరక
సునిశితముగ నతని నింత చూచితి వయ్యో,
ధనదత్తుపాటి చేయఁడె
మనసిజహార, మల్హాణుండు మది నీ కెన్నన్.

క. పగఁబాయుమిఁ దగుతాలిమి
మగవారును నాఁడువారు మము నెన్నంగా
నగుబాటుగఁ బెడఁబాపితి
దగవా పగవారిఁగూడ దైవము, నీకున్.

క. ..........................
వనితామణి విరహావహ్ని వారింపను నే
యనువును లేకయ్యెడ శం
భుని పదపద్మములఁ బ్రొద్దువుచ్చుచునుండెన్.

క. అట్టియెడఁ ధనదత్తుఁడు
చిట్టకముల నబలమీఁదఁ జేసాఁచి మదిన్
బట్టఁగఁ దలఁచినఁ బట్టీ
కిట్టాటనో యిట్లుపట్ట నేటికి ననుచున్.

వ. ఉన్నయెడ సమ్మ్లానముండు తనసఖుం డగు సుశీ
లుండును దాను నప్పుడు తన నిజాచార్యుం డైన
విద్యానిధికడ కేఁగి నమస్కరించిన నయ్యా
చార్యుండు నతసిం గనుంగొని యిట్లనియె.

క. ఇదియేమి నేఁడు మ్లాన
వదనాబ్జము సొంపుదక్కి వసివాడి కదున్

హృదయంబు విన్నవోవుచు
నెదవడియున్నాఁడ వింత యేటికి ననినన్.

క. తలిదండ్రులు నిను నేమేఁ
బలికిరొ పురిజనులు......యెడన్
గలిగెనొ నీరసమేనియు
నలపుష్పసుగంధి సేమమైయున్నదియో?

క. కనుఁగొనము మూఁడునాలుగు
దినములనుండియును జదువఁదీఱదొ వేత్రే
పని యేమేనియుఁ గలిగెనొ
వనిత న్నినుఁగూడి చదువవల దన్నదియో?

క. గుణవంతుఁడ వన్నింటను
గణనకు నెక్కితివి రూపకలితుఁడవు సుధీ
[illegible]............భూ
షణుఁడవు మద్భాగ్యనిధివి చనునే యనినన్.

క. ఏనేరము నెవ్వరియెడఁ
గానము గురునాధ, నీదుకారుణ్యముచే
నీ నిఖిలము ననుకూలమె
యా నెలఁతుకయందుఁగాన మాపకృతి యొందున్.

వ. అని మలహాణుండు సుశీలు మొగంబుఁ జూచిన
నతం డిట్లనియె:

చ. మలహాణ పుష్పగంధులు క్ర
మంబునఁ గూడి చరింప భూ జనుల్
కలయవి లేనివిఁ బలుకఁ
గా విని యందఱుఁ జాల దూఱి యా
వెలఁదుకతల్లి యల్గి యిలు
వెళ్లఁగనీయక యొక్క వైశ్యునిఁ
గలిగినవానిఁ గూడుకొని
కన్నెఱికంబున కుంచె నచ్చెలిన్.

క. అది కారణముగ మలహాణు
హృదయము విహ్వాలతఁ జెందియిట్లయ్యెనన
మదిఁ గంది పల్కె నాయన
ముదితలుగారోటు దుఃఖమూలములనుచున్.

సీ. పణ్యాంగనారతిఁ బాయకుండుటఁ జేసి
మధుపానగోష్ఠికి మనసుపెట్టు
మధుపానసుఖముచే మరగి మాంసమునకై
వేటపైఁ జిత్తంబు విడియఁజేయు

వేటపైఁ జిత్తంబు విడియ ధూర్తులతోడ
నర్థాశ జూదంబు లాడఁజొచ్చు
ననిశంబు జూదంబు లాడుచుఁ దనయిచ్చఁ
దోడ్తోన చేయును దుర్వ్యయంబు
దుర్వ్యయుండయి పరుసంబుదోనరఁ బలుకు
పలికి యంతటఁ బరదండనలకుఁ జొచ్చుఁ
గాన వ్యసనంబునకు నాదికారణంబు
తలఁచి చూడంగ వారకాంతారతంబు. ✓

*　　*　　*　　*　　*

క. నడవగవలెఁ దగునడవడిఁ
దడయక సంసారియైనఁ; దానటుగాఁడేఁ
బడిసెట్లనె కూడగవలెఁ
గడగానక వేశ్యలిండ్లఁ గడతేరుటకున్. ✓

*　　*　　*　　*　　*

క. సురపతియును జందురుఁడును
బరకాంతలఁగోరి కాదె పనిచెడి దోషా
కరులై యపకీర్తులఁ బడి
పరుసలుచెడి రందు రెల్లవారలు నవ్వన్. ✓

చ. అరయఁగమానహానిధన,
హాని సముంచితకీర్తి హానియున్
బరమవివేకహానియును
బాంధవహానియుఁ బ్రాణహానియున్
సురుచిరపుణ్య హానియును,
జొప్పడునెప్పుడుఁ దప్పకుండఁగా
బరసతిగోరువారలకుఁ
బల్మఱునెంతటివారికేనియున్. ✓

క. పరనారీసంగమసుఖ
మరనిముసము పరధనాపహారణమున నిజో
దరపూర్తి గొన్నిదినములు
నరునకుఁ గల్పోపభోగనరకము దీనన్. ✓

క. తొల్లిం దగిలినవారికి
నెల్లచెడున్ శ్రీలుచెంద వేకాలంబున్
హత్తదు మోక్షము మఱి వి
చ్చిత్తులగున్ మంత్రతంత్రసిద్ధులు మిగులన్. ✓

చ. మునివరుఁడైన త్రేపకడ
ముండమొకం బొకయింత చూచినన్

మునుఁగును బాతకంబులను
    ముట్టినమాత్రన పోవుఁ బుణ్యముల్
పనివడి దానియూర్పు పయిఁ
    బాఱిన నాయువణంగు దానికా
ననఁగ నొకింతదాఁకినను
    గాంచును జెట్ట సురేంద్రుఁడేనియున్.

క. ఎన్ని వ్రతంబులు సల్పిన
నెన్నియుపవాసంబు లున్న నిలఁ దీర్థంబుల్
మెన్నేనాడినఁ గానీ
కన్నను దోషంబు విధవఁ గలలో నైనన్.

క. తోషింప నిజకుటుంబముఁ
బోషించుచు నతిథిపూజఁ బూన్చుచు గరుణా
న్వేషుండగు పుణ్యంబున
కీషన్మాత్రంబు సరియె యెన్నేఁ గ్రతువుల్.

క. కులపతి శిశువులుఁ దానుఁ
దలమొలకును లేక నలిగి దైన్యపడంగాఁ
దలఁపకయుండినదోషము
కులకోటుల నరకమునను గోని మునిఁగించున్.

క. తావలవకున్న సౌఖ్యం
బేవలనను లేదు వలచెనే దుఃఖంబౌ
కావున నన్యస్త్రీరతి
యీ వసుమతిఁగూడదందు రెఱిఁగినజాణల్.

గీ. పగటనుపవాసదినములఁ బర్వతిథుల
సంధ్యలను గాదు రతిసల్ప సజ్జనులకుఁ
బాయు నాయువు పగలుచేభంగమొందుఁ
దలఁగు సంపద దుష్టసంతతిజనించు.

క. అతిసురతము రోగప్రద
మతిహీనాహము సకలహానియగు నీరెండుఁ
కతిపయదినముల నరునికి
నతికష్టముఁ జేయునందు రాయుర్వేదుల్.

వ. అనుసమయంబున భద్రదత్తకూచిమార పాం
చాలాదులు, విటవిదూషకప్రేష్యనాగరకాదు
లుఁ జనుదెంచినఁ గూర్చుండుమని విద్యానిధి
పాంచాలునింజూచి మదనతంత్రంబులు మీా
రెఱుంగనివిలేవు; స్త్రీపురుషులకు జాతిలక్షణం

బును, దదీయానుకూలనిర్ణయంబులును నె
ఱింగింపుమనిన నతం డిట్లనియె.

సీ. మొదలఁ గళాస్థానములు దుష్టతిథులును
జాతిభేదంబులు సత్త్వములును
ద్రవనిర్ణయంబులు బంధవిశేషచాతురి
దతియుఁగాలము వయోధర్మములును
నెఱతనంబులును యోనిప్రమాణంబులు
వలపులొల్లములునుగలయు తెఱఁగు
నింపులు ననువాగహేతువుల్ పరిరంభ
ణము లుత్తమాధమనాయకులును
మదనపంచాంగమును యంత్ర మంత్రతంత్ర
విధులు వశ్యౌషధక్రియల్ వెరవులెఱిఁగి
కలసిరేనియుఁ గూరిమి నిలుచు టరిది
వారిజాక్షుల గెల్వ నెవ్వరికి వశము?

వ. అయినను నే నెఱింగిన తెఱంగున విన్నవించెద
నాకర్ణింపుము.

సీ. తనువుమార్దవమును మనసుచాంచల్యంబు
తనివిదీఱమియుఁ జిత్తినికి నమరు

ఘనకుచద్వంద్వంబు కఠినాంగకములును
దృఢమగురతియు హస్తినికి నమరు
ఇఱిగుబ్బచన్నులు నిఱుపేదకౌనును
గినుకయు నరయ శంఖినికిఁ దొరయు
సరసంపుఁజేతలు చతురసంభాషణల్
మృదువర్తనములు పద్మినికిఁ మెఱయు
మధువువాసనయును గరిమదముకంపు
నింపుగంధంబు వికచపద్మంపుఁదావి
వలచు వలరసమలరు పల్వారుసతోడ
నంద్రు కామకళావేదు లఖిలవంద్య!

సీ. కన్నులు ద్రిప్పుచు వన్నెలు పచరించు
చూపుఁ జూపుచును భద్రుండు దిరుగు
నెదిరియిం పెఱుఁగక యీవి యొంతేనిచ్చి
తనయిచ్చ నెపుడు దత్తకుఁడు దిరుగు
మందు మంత్రంబులు మాయలు పచరించి
ఖండించి కూచిమారుండు తిరుగు
మనసులు గరఁగించి మర్మజ్ఞుఁడై రతిఁ
దేలించు సతులఁ బాంచాలుఁ డెపుడు

భద్రకుఁడు సూవె చిత్తిని ప్రాణవిభుఁడు
హస్తినికి దత్తకుఁడు మనోహరుఁడు మిగులఁ
కూచిమారుండు శంఖిని కూర్చుప్రియుఁడుఁ
జాలఁ బద్మిని మెచ్చుఁ బాంచాలుఁ డెపుడు. ✓

క. లోలల భద్రకువిధమున
బాలలఁ బాంచాలురీతిఁ బ్రౌఢల నల్లిక
జాలఁగ దత్తకుగతి జవ
రాలిందగఁ గూచిమారరమణుఁ డుగవయున్. ✓

సీ. పరకాంతగూడని పతి యనుకూలుండు
తరుణికి మొఱఁగునేఁ బూరి శఠుండు
దక్షిణుం డాత్మ నందఱి సరిగాఁజూచు
నపరాధి యయ్యుఁ గీడాడు ధృష్టు
విటుఁడు వేశ్యలయిండ్లు వెదకిక్రమ్మఱుచుండు
మత సేవకుఁడు పీఠమర్దకుండు
నాగరకుఁడు పరస్త్రీగమనాపేక్షి
యలపిదూషకుఁ డుపహాస్యకారి
అరయ సారిక పతి కెనయైన బోటి
చతురభాషలఁ జతురిక చాలప్రోడ

సతులఁ బతులను గూర్ప సంచార నిపుణ
తిరుగు నే పనులకును దూతిక ధరిత్రి.

సీ. బాలయయ్యును గళాప్రౌఢి చూపువిదగ్ధ
యొకపాటిమొలకమై యుండు మధ్య
యౌవనంబున నుండి యతిమూఢ యగుముగ్ధ
పరుసంబులాడెడు పడఁతి పరుష
అంతైన గరఁగెడునంగనామణిశ్లథ
ఘనయనుసతి యతికఠినగాత్రి
యలిగి కీడ్పడకుండునట్టికోమలి ధీర
పతిభక్తిగలిగినసతి స్వకీయ
జార పరకీయయనియొడు చపలనేత్రి
విత్తమంతయు లోఁగొని వెడలఁద్రోయు
* * * * *
వారకాంతాలలామసాధారణాఖ్య.

సీ. ఆచారధీసుగుణాన్విత మునిసత్వ
నలి నిద్దురయె కోరు నాగసత్వ
భూతసత్వయు నెందుఁ బొందదు సంతుష్టి
జడమలినాంగి పిశాచసత్వ
గంధర్వసత్వ చక్కనిది పాడఁగ నేర్చుఁ
దలఁక దేవనులకు దైత్యసత్వ

శృంగారవతి కోమలాంగి కిన్నరసత్వ
యధిపుఁ బోషించును యక్షసత్వ
జడతతో నుండు సతి విప్రజాతి దరయ
నధికరాజస నృపజాతి యగులతాంగి
విసుగు గను వైశ్యజాతి సాధ్వీలలామ
చతురయగు నన్నిటను శూద్రజాతిలలన. ✓

సీ. స్వాధీనపతిక నిజాధీశు వశునిగా
మెలుపంగ నేర్చిన మీననయన
వాసకసజ్జిక వసుని రాకకు మేను
నిల్లు శృంగారించు నిందువదన
పరకాంతఁగలసిన పతిచిహ్నములు జూచి
వగచు ఖండితయను వనజగంధి
రమణుండు వేళకు రాకున్నఁ బొగిలెడు
నది విరహోత్కంఠయను లతాంగి
యొరలుఁ బ్రోషిత ధవుఁ డెడయున్న పతికి
నలరుఁ గలహాంతరిత నాథు నలిగి త్రోచి
వేగుఁ బతి నిచ్చఁగానక విప్రలబ్ధ
మఱవ కభిసారికాఖ్య క్రమ్మరును నిచ్చ. ✓

*   *   *   *   *

క. ఏటికి మందులు మాయలు
నేటికి ద్రవ్యంబు జాతు లింతులమనసుల్
నాటుకొనవిభుఁడు చల్లని
మాటలఁ గరఁగించి కలయు మతమదియైనన్.

క. మనసెఱిఁగి బాహ్యరతులను
బెనుపుచుఁ జోఁకోర్చియింపుబెరయఁగ నెపుడున్
దనసుఖము దలఁపకుండెడు
మనుజునిఁ బాయంగఁగలరె మగువలు జగతిన్.

సీ. మృదుమార్గమునఁగాదె కొదలేక గాడ్పులు
చొరరానిచోటులఁ జొచ్చి విడుచు
మృదుమార్గమునఁగాదె నదనదీజలములు
కొండలఁ దెగఁబాఱి క్రుంగఁజేయు
మృదుమార్గమునఁగాదె యదనెఱింగి మిళింద
మలరులతేనియ లపహరించు
మృదుమార్గమున గాదె యదిచంద్రచంద్రిక
మేలైనపటికంపుఱాలు గరఁచుఁ
గాన మృదురీతి మెలఁగెడు మానవుండు
[illegible]చిత్తవృత్తుల లొంగఁగొనును

నఖిలకార్యంబులును వానిహస్తగతము
లెన్నిచూచిన సంశయ మింత లేదు.

వ. అని పాంచాలుండు పలికినఁ గూచిమారుం
డిట్లనియె.

క. ఒడలలయించుక యూరక
బడలంగా నేమి తమకుఁ బ్రాభవమయ్యెన్
గెడగూడి సతులమాయలు
నుడుగక లోఁబడఁగఁ జేయుటుచితముదలపన్.

క. తిలకంబు వాలు మందును
దలముడి బాసటముబోలు తప్పులు నేర్పుల్
గలమానవటీని విధమున
జెలఁగ కమఱి వారసతులఁ జెనకఁగ వశమే.

సీ. అడవులఁజరియించు హరిణశాబకములు
మరపినఁ దిరుగవే నరులవెంట
నెట్టనవాకట్టి పెట్టెలఁబెట్టిన
నుండవే ఘోరవిషోరగములు
వెరవున నొయ్యనఁ గఱపినపలుకులు
పలుకవే పక్షులు ప్రతిభతోడ

యంత్రక్రియాయుక్తి నందంద జనులకు
జ్వలతప్తలోహముల్ చల్లగావె
తారెఱుంగకున్నఁ దగవాని మందులు
మంత్రములును సురతమాయ లౌట
వనితలకును లేవె వశ్యౌషధక్రియల్
విటులు వలెనటంచు వెదకిరేని.

వ. ఆమాటలకు భద్రకుండిట్లనియె.

కం. సుడిగొనెడు నోటిముఱికియు
నుడుగక బలుగాలు వలచునోడలుంగలయా
బడుగును గనుఁగొని నంతనె
పొడకట్టక వెఱచిపోవు భూతములైనన్.

క. గరగరనై యెల్లప్పుడుఁ
బరిమళముల ప్రోఁకయగుచుఁ బైవంచనతో
నరవిరి బాగునఁ దిరిగెడు
బురుషులఁబాయంగఁగలరెవొలఁతులుజగతిన్.

క. తలవలువలు పులుమాయక
మొలమిమెయి న్నాఁడునాఁటి కిగురొత్తంగా

మెలగెడుపురుషునిఁ జూచిన
నిలుచుకయాదృష్టి యెట్టి నెలఁతుక కైనన్.

గీ. చివ్వగుణము విడిచి చిలుకెట్టుతరితీపు
గానిపించుగాలగాని రీతి
తెరవతలఁపు మచ్చు మెఱఁగి యల్లనఁ దీయ
నేరకున్న యతఁడు నీరసుండు.

వ. కావునఁ గూరిమిసతులకు నలంకారంబు మూ
లంబని భద్రుండు పల్కుటయు దత్తకుం డిట్ల
నియె.

గీ. రమణి దనయిచ్చఁ గలయు టొంతయునులెస్స
దాన సౌఖ్యంబుఁ దలఁచుట గాని త్రోవ
చెఱకు నలినలిగాఁగను గొఱికి రసము
క్రోలుజాడల వెలయింపఁ గోర్కు లలరు.

క. వదనమున నమృతరసమును
హృదయంబునవిసమునునిచె నింతులకు నజుం
డదిగాదె యధర మానుచు
హృదయము తాడన మొనర్తు రెఱిఁగినజాణల్.

క. ఉల్లివలెఁ బెక్కుపొరలై
నల్లివలెన్ నిద్రఁజెఱచి నమ్మిన దాఁకన్
బల్లివలెఁ గొల్లఁ బెనఁగుచు
వెల్లివలెన్ గడవఁబాఱు వేశ్య ధరిత్రిన్.

గీ. రణములో దేజినెక్కుడు రౌతుఁబోలి
యతివ మరుపోరఁ బెల్లార్చి యంటవ్రేసి
కలయనేర్చిన గోర్కులు గలయుఁదాఁక
యూరకేలబ్బు మదనసాయుజ్యపదవి.

క. కూరిమి దన మదిఁ గలిగిన
నేరము లెంచంగవలదు నెలఁతలవలనన్
తోరపు దిరిసెనపూనెన్
సారపు దేనియలుతేలు చవిగొనునెడలన్.

క. ధన మీయవలయుఁ దొలిఁ దొలి
జన మీయఁగవలయుఁబిదప సరసులు ధరలో
ధనమును జనవును వెలిగా
వనితల లోఁగొనఁగ వశమె వనజజుకైనన్.

క. లోభాత్ము నొల్ల రతివలు
లోభాత్మునిఁ జేరరెందు లోకులుధరలో

లోభాత్ముఁ డుడుగు ధర్మము
లోభం బపకీర్తి నరుని లోఁబడఁ జేయున్

క. ఆకుల వ్రాఁతలు నమ్మక
కోకలు రూకలును వెలిగఁగూర్తు రటంచ
గీకలకు వచ్చువిటుగని
కూకులువ(న)త్తులునుగో వెగొంతురువమనన

వ. అని దత్తకుంపు పలికిన విటుం డిట్లనియె.

క. కులసతి సంతానార్థము
నిల దాసీసంగమంబు హీనము పరకాం
తలు హానియనుచుఁ గాదే
వెలయాం డ్రస్పృశించె నజుఁడు విశ్వములో

క. వెఱ పుడిగి యిచ్చనచ్చిన
తెఱఁగునఁ గలయంగవచ్చు ధృతి వారస్త్రీ
చెఱకు నడు మనిన నందున్
గొఱంత సొయదియనుభవించుగుణగణ్యా

క. దివిజులకును రంభాదులు
భువిజనులకు వారసతులు భోగాస్పదలీ

యువిదలఁ గూడెడిభాగ్యము
లవిరళపుణ్యులకుఁగాక యబ్బునె తెలియన్.

చ. క్రతువులు చేసి యాగమని
కాయము లభ్యసనం బొనర్చి సు
వ్రతులగు భూసురోత్తముల
వారితనిర్జరకామినీకుచో
న్నతపరిరంభసౌఖ్యముల
నాసల నీనెడివారకామినీ
రతిఁ ద్యజియించువారలు తి
రస్కృతు లెన్నఁగ ముజ్జగంబులన్.

క. కలయికము లెఱిగి విటులం
గలయుచు ధనమానమిగులగలుఁగకఘనులన్
ఖలులన్ సరిగాఁ జూడక
మెలఁగెడు వారాంగనలనుమెచ్చఁగవలయున్.

క. అని విటుఁ డాడిన మాటకుఁ
గనలుచు నాగరకుడనియెఁగటకట నేఁడీ
వినరానిమాట నీచే
వినవలసెఁ వీనులందు వీఱేడి భంగిన్.

క. వాసి చెడుదాసివలనన్
గాసును వీసంబు వేశ్యకతమునఁ బోవున్
దోసంబు విధవ పరసతి
యేసుఖకారిణి యటంచు నింద్రుం డనఁడా.

క. మగనికి వెఱవక యింటికిఁ
దగఁదానేకర్త్రయగుచుఁ దత్పరవృత్తిన్
వగగలదై వెలిఁదిరిగెడు
మగువం గెడగూడువాఁడు మదనుఁడు గాఁడే.

క. విను వింతలైనసౌఖ్యము
లనుబొందుచునెపుడు వేడ్కలనుదనియుచుఁదా
ననువరియై పను లెడపుచుఁ
గని తిరిగిన నేమిబ్రాతి కామ్యార్థంబుల్.

వ. అనిన విదూషకుం డిట్లనియె.

గీ. తొత్తువలనఁబోవు దొరతనం బంతయు
వేశ్యవలన నర్థవితతి యణఁగుఁ
బరవధూటివలనఁ బ్రాణంబు పై వచ్చు
విధవఁబొంద మేలు విరహులకును.

* * * * *

సీ. అనిన నడ్డగించి యానొ విదూషక,
తగును మెచ్చ నీకుఁ దగినవారి
దొరవు చాలుఁజాలు దొలఁగుమంచు నదల్చి
కొనుచు పీఠమర్దకుండు పలికె.

క. వాసికిని వేశ్యఁబొందిన
గాసులు చేదిగును సుగతి గలుగక పోవ్రు
మీసాలమీఁది తేనియ
దాసియకా కితరజనులఁ దలఁపఁగ నేలా.

క. పీడియు మడుగదు గుద్దుల
కోడదు గాఢంపురతుల కులుకదు కలలోఁ
జూడదు గరగరికలు మఱి
యీడా దాసికిని జగతి నేకామినులున్.

క. కాసులు దెమ్మని యడుగదు
చేసన్నలవచ్చు రతికిఁ జేరగ నెపుడున్
మూసిన ముత్తెముఁ బోలెడి
దాసి నుదాసీన మాడఁదగ నెవ్వరికిన్.

వ. అని పీఠమర్దకుండు పలికినపలుకలకు సుశీలుం
డిట్లనియె.

క. శ్వేతాదులు కైవల్యం
బాతతమతిఁగనిరి వేశ్యలందునె కాదా
జాతియు నీతియుఁ గలిగిన
యాతెఱవలపొందువలన హానియుగలదే.

వ. అనిన విని మల్హణుం డక్కథ యొఱింగింపు మనిన.

మ. సరసౌదార్యవినిర్జితామరగవీ
సంతానచింతామణీ
వరపాథోధిశశాంక శాంకరపద
ద్వంద్వార్చనాసంతతా
దరసంవర్ధితగోత్ర గోత్రరిపుసా
ధారణ్యాసంపూర్ణభా
సురభోగాస్పదశోభ శోభనమహా
చుండిస్థలగ్రామణీ.

క. జంభాహితవరకుంభవి
జృంభితదోర్దండసత్త్వసింధుగభీరా
శంభుపదపద్మలీలా
బంభరసోమాంబికాతపఃఫలరూపా!

శ్రీః

# శృంగార మల్హణచరిత్ర

తృతీయాశ్వాసము

---

శ్రీరంగధామమంగళ
కారణకరహాటలాటకర్ణాటకగాం
ధారనరనాథకృతస
త్కారగుణౌన్నత్య చండికాళీమాత్యా.

వ. అవధరింపుము సుశీలుండు మలహణున కి ట్లనియె.

సీ. అవని నవంతికయను పట్టణంబున
వెలయ శ్వేతుండను విప్రుఁ డొకఁడు
తలిదండ్రిమాట వీనులఁ జేర్పఁ డెన్నఁడు
గురులయానతి యన్నఁబరుస నేను
బాంధవులన్నను బరిహాసములు సేయు
విద్వాంసు లన్నను వెక్కిరించు

పెద్దలఁ గన్నను బ్రేమముల్ పల్కఁడు
మౌనులఁ బొడగన్న మండిపడును
దైవతాంతర మన్నను దప్ప నాడు
జపతపంబులు దలఁచినఁ జప్పరించు
క్రతువులన్నను మాటకె కల్లలాడు
నతిథులన్నను మండుచు నడిచిపడును.

సీ. దరిబేసులన్నను దద్దయుఁ గొనియాడు
జైనులగన్నను సంతసిల్లుఁ
గుచ్ఛితకాండ్రన్న గొండాటములు సేయుఁ
బాపండులన్నను బరిణమించు
మాతంగు లన్నను మఱిచేరరమ్మనుఁ
బలుగాకు లన్నను భక్తిసేయు
భాండికులన్నను బాయఁ డేప్రొద్దును
గుండగోళకులన్నఁ గుస్తరించు
జారచోరులఁగన్నను సంతసిల్లుఁ
గట్టుపోతులఁ బొడగన్నఁ గౌఁగిలించు
నేభ్యరాసులఁ బొడగన్న నిచ్చగించు
దూషకుల గన్నఁ దెగఁబాసి తొలఁగఁ డెపుడు.

చ. వెలితలబుట్టమందులిడ
వేదుఱుబెట్టును జూదమాడ ని
చ్చలు చని జూదకట్ట కడ
సారెకు నొడ్డున కోడిపోరు లే
బలితపుటాటకైనఁ బయి
పందెము పెట్టును జాగిలంబులుఁ
వలలు ఘటించి వేఁటసని
వంచన లేక వధించు జీవులన్.

గీ. కుడువఁగూర్చుండి యప్పు డాకూటికడను
జందె మొకచేతఁ బట్టుక సంధ్యవార్చుఁ
గాళ్లుచేతులు నెన్నఁడుఁ గడుగుకొనఁడు
విడుచుఁ గాల్మడి నిలుచుండి నడచినడచి.

సీ. మరపిసన్న్యాసుల మాచకమ్మలఁగూర్చి
తలవరులకుఁ జెప్పి దండుగోర్చు
తివిరికొత్తములొద్దఁ దీర్ఘవాసుల నిల్పి
పరిహాసములు చేసి బందు సేయు
వెస దిగంబరులకు వీర్యంబు గల్పించి
సంతలఁగదిరుంచు సాధుఁబోలి

పరచుటిల్లాండ్రను బైకొని భ్రమయించుఁ
దనుఁదానె భ్రమయించి ధనము దివియు
మెరసిపో నింటివారల మేలుకొల్పి
తవిలి దొంగలచేతికి దాళ్ళనిచ్చి
కూఢిఁదాతను గొంతిగొట్టాడఁ బెట్టి
నిక్కి తనసీడఁ దనుఁదానె వెక్కిరించు.

సీ. పాంచరాత్రికమన్నఁ బాడును దిగునామ
మరిగూడుకొని యడియఁడ నటంచు
బంతిపచ్చమటన్న బరువెత్తి బూడిదె
పెండెకట్టులు చాలఁ బెట్టుకొనును
కాకొల్లి పరసన్నఁ గదలును నెదురుగాఁ
దలవిరఁబోసుకొ దాటుకొనుచు
శివసత్తి చెమ్మన్న గవుదలు మెడనిండఁ
బూతచెందిరమును బూసి వెడలు
చెలఁగి రాజులతంతన్న చిమ్మటరుగు
బడుచుగల పాటఁబాడుచుఁ బాత్రలాడు
బాలుచు షడ్దర్శనంబుల పూతకోక
యనఁగఁ జరియించుచుండె నయ్యావనిసురుడు.

సీ. వలను మీఱఁగఁ జంద్రవంకతోఁ దిరు నామ
    మెట్టి గంధపుగీరుబొట్టమర్చి
నడుమ విభూతి నిండఁగఁ బూసి యాలోన
    జుక్కబొట్టును దిరుచూర్ణమునిచి
చిగురుగోళ్లను జాఱు సిగ నిక్కఁగా వేసి
    కదలిపూఁతేకులు గానఁ జెరివి
నెఱికదుప్పటి కొంగు నేలజీరఁగఁ గప్పి
    వెలిదూలగోణాము వేళ్ల నిడిచి
కప్పువెట్టిన మునిపండ్ల కడలుఁ విడెముఁ
జప్పరింపుచు బెదవులు సందుకొల్పి
గిరుకు సంబువు కాళ్లను నోఱయు మొఱయ
నిక్కుచును నీల్గుచును వట్టినీటుతోడ.

సీ. జంతలఁ గనుఁగొన్న సరసంబులాడుచుఁ
    జెడిపెలఁ గనుఁగొన్నఁ జేరఁ జనుచు
భాండీరులనుగన్నఁ బ్రాణంబులొసఁగుచు
    దాసకాండ్రనుగన్న నాసపడుచు
దేబెలఁ గనుఁగొన్న వాబల్మిఁ జూపుచు
    దాసికత్తెలగన్నఁ దారసిలుచు

దాసిజనముఁగన్నఁ దకపికల్ వెట్టుచు
ద్రాగుఁబోతులఁగన్నఁ దనిసినగుచు
జారులను గన్నఁ జప్పట్లు చఱచుకొనుచు
వేశ్యలను గన్న మోములఁ ద్రేలఁబడుచు
బందెతలఁగన్నఁ గదలక యుండగొనుచు
వింతయునుగన్న దూరంబు వేగజనుచు.

క. మరగి కడునప్పురంబునఁ
దిరుగుచుఁ బెనులెస్స దేశద్రిమ్మరి యనఁగా
బరికించి యెల్లచోటుల
వెరవారగ వెఱ్ఱివేసి విరిసినపిదపన్.

క. విటతాటకియను లంజెయు
నటలంబడి సొక్కి సొక్కి సదమదమై తా
నటునిటుఁ బోవను జాలక
చిటిముడిచేఁ గాసులెల్ల చెల్లఁగఁ గొఱకెన్.

క. శతవర్షంబులు వెళ్లిన
యతికష్టపు జంతుగాన నదియుఁ వానిఁ
గతిచెడి నవ్వక పిలువఁగ
బతిచెడియయ్యింతిపొందుఁ బాయకయుంటేఁడున్.

చ. మునుకొని పట్టుగోఁత్రియల
ప్రముచ్చిలి రాత్రులఁ దెచ్చియిచ్చునో
య్యనఁ దెరవాటుగొట్టి కల
యర్థము దానికిఁ బెట్టుకావటం
గనలుచు రేయునుం బగలుఁ
గట్టెలు నీళ్లును మోచు పారునే
పనులకుఁ దానె పంచఁగల
పాటులనుంబడు నెల్లిభంగులన్.

చ. తటతట దంతకాండములు
దాఁకగఁ బ్రక్కలు వీపు వంపఁగా
జొటజొట నీళ్లుముక్కులను
జూడ్కులఁ గ్రమ్మఁగఁ గాళ్లఁ జేతులుక్
చుటచుట గోరబోర నెటు
చూచినఁ దానగు శీతవేళలక్
దుటదుటఁ బాఱుచుక్ బనులు
దూకొనిచేయును దానికెప్పుడుక్.

ఉ. ఎండను భూమి వత్సలయి
యెల్లెడ శేషఫణామణి ద్యుతుల్

గాఁండకరప్రభం బెనుపఁ
    జాలి తృణంబు తరుప్రకాండముల్
మండఁగఁ బొట్టియుం దలయు
    మాఁడఁగ నిప్పులు చల్లువేసవిన్
కొండల కేఁగి యాకలముఁ
    కూరలుఁ గాయలు దెచ్చు దానికిన్.

చ. పిడుగులు వ్రేసి నల్గడల
    ప్రేలిపడన్ బెనుగాలి రువ్వన్
సుడివడఁగొట్టి మేఘములు
    జోరున బాములు వ్రేల గట్టిన
ట్లుడుగక మిన్ను దూటుపడె
    నో యన బెన్ జడివట్టిమోదఁగా
జడియక వానకాలమున
    సారెకుఁ జేయును దానికిం బనుల్.

క. తలమొడ తెఱుఁగక యీగతి
వలచికడుం దిరిగి దాని వలఁబడి దానున్
సిలుకాల నిలువఁదీఱక
మెలఁగంగా నొక్కనాఁడు మెలఁతుకయంతన్ .

క. తలకడక యర్ధరాత్రం
బలరఁగ నయ్యమ్మపూజ కలరులు దేవా
తలఁప వనవుడును దానికిఁ
దలఁకుచుఁ దానున్న నిచటదాఁచితినమడున్.

సీ. పాటినగరితోఁటపైఁ గావలున్నట్టి
వారికన్ను మొరగి బీరమునకు
కోట వెలుగు బ్రోకిగొబ్బున దిగజాటి
విరులు చాలఁ గోసి వెడలిమగుడి.

క. తడవాయె ననుచుఁ గామిని
కడుఁ దిట్టునో మిన్నకేనిఁ గట్టునో కొడిమల్
వడి నేమిసేతు నిఁక నని
వడి దప్పకయుండె నతఁడు పరుగునరాగన్.

క. మంకుతనంబున హేయపుఁ
బంకములో నొక్కపూవుఁ బడుటయు దానిక్
శంకించి తివియ నోడుచు
శంకరు కర్పణమటంచుఁ జనియెను వేగన్.

వ. చని ముందటం బెట్టిన మండిపడి యింతతడ
వుండుట కేమినిమిత్తంబు, అపవిత్రజన్మంబునం

బుట్టిన నిన్నుఁ బావనుని జేసితి కృతఘ్నుండవై
మఱచితే యని యదల్చిన నతండును గజగజ
వణంకి యియ్యపరాధంబు సహింపుమని పదం
బులఁ కెరఁగిన శిరంబుఁదన్ని విదల్చుకొనుచుఁ
గోపావేశంబున నుండె నంత వనపాలురు మేలు
కాంచి తలవరుల కెఱిఁగించిన.

క. కొలకొలన పట్టు నేచని
యిలుచుట్టుక వాని దాని యిల తేనికడన్
తలవరుల నిల్పి వారల,
దలిరులునుం దెచ్చి చూపఁదగునే యనుచున్.

క. ఇలఁ దిట్టుకొంచు మోదుచు
నులుకం గదియంగఁ గనలి యుద్యానములో
పలి కెట్లు వీఁడుచొచ్చెనో
తలఁ కించుక లేక యనిన ధరణీశుండున్.

సీ. చంపవలదు వీండ్ర సర్వస్వమును గొని
విడిచి యిప్పురంబు వెడలఁద్రోయుఁ
డనినఁ దలవరులును నట్ల వారలచేతి
విత్తమెల్ల దోఁచి వెడలద్రోఁయ.

క. అర్థము తను గడియించును
నర్థంబును దాఁ గడించునది యాయన కా
వ్యర్థంపు ముండ యూరకె
యర్థమునకుఁ బొంగిలిపొంగిలియసువులుతోలఁగెఁ.

వ. అంత నతండును దద్వియోగవేదనం గ్రాఁగి శరీరంబు దొఱంగుటయు యమకింకరులుం బఱతెంచి వానిఁబట్టుకొని పోయి జమునిముం దటం బెట్టిన బిట్టుమిట్టిపడి యతండును.

గీ. చిత్రగుప్తులఁ బిలిచి యీ చెడుగు చేసి
నట్టిదోషంబు లేమేమియనిన వారు
కవిలె వీక్షించి వానిపైఁగనలిపడుచు
దేవ వినుమని చెప్పిరి తేటపడగ.

సీ. పశుహత్య లన్నను బదునేడులక్షలు
స్త్రీహత్య లన్ననుఁ జెప్ప నరిది
శిశుహత్య లనిన నెంచెదము మేమనరాదు
బ్రహ్మహత్యలు వే లపరిమితములు
నర్బుదంబులు దాటు నటు భ్రూణహత్యలు
చౌర్యవర్తనములు సంఖ్య గడుచు

బరదార సత్వముల్ పరికింప మితి లేవు
తక్కుదోషంబులు లెక్కలేవు
కడలి తరఁగలైన నుడుగణంబైనను
నిసుకరాసులైన నెంచవచ్చు
వీఁడుచేసినట్టి వివిధపాతకములు
తలఁప బ్రహ్మకైనఁ దరము గాదు.

వ. అనుటయు దండధరుండు మండిపడి వానిం
జూచి నిజకింకరులతో నిట్లనియె.

సీ. పరసతిపై దృష్టిపఱపినఁ కన్నుల
నెఱ్ఱఁగ్రాఁగినయట్టి యినుముఁబోయుఁ
డితరాంగనలయిండ్ల కేఁగిన పదముల
నాటుఁడు క్రొవ్వాడి నారసములు
మొనసి యొండులసొమ్ము ముచ్చిలుచేతులఁ
జొనుపుండుసూదులు మనిపి నినిపి
యన్యకాంతలచన్ను లానినయురమున
నెత్తుఁడు కరఁగిన యినుపముద్దఁ
జేరి కొండెంబు నొరులకుఁ జెప్పినట్టి
జిహ్వఁగత్తుల నింతింత చీఱి విడుఁడు

ఖించి యన్యాయవిత్త మార్జించినట్టి
కుటిలదేహంబు అంపానఁగోయుఁ డిపుడు.

గీ. ఇతరకాంతలఁ దనతోడ నిచ్చగించి
యుపరిసురతంబు సలుపంగ నొడ్డుకొన్న
యల్లచోటులఁ గ్రాఁగిన యట్టి లోహ
పాత్ర నెత్తుఁడు కడుఁగ్రాఁగి భస్మముగను.

ఉ. పట్టుఁడు కారులం దపుడ
పండులు మల్లఁగవ్రేసి నంపెటక
గొట్టుఁడు కర్పటంబవియ
గుద్దుల ద్రొబ్బుఁడు చిల్లఁగోలలన్
గుట్టుఁడు గొంతుగోల ముకు
గోళ్లను మొత్తుఁడు తప్తలోహముల్
వట్టనఁ జీఱి పొట్టనిడి
చర్మముఁ దీయుఁడు తిత్తి దోఁపుడున్.

వ. అనుటయు దేవా! యితండొక్కనాఁ డర్ధరా
త్రంబున వేశ్యకుం బూవులు గొనిపోవునెడ
నపాత్రస్థలంబున నొక్కపుష్పంబు పడిన నది
తనకుం గొఱగామి శివార్పణంబు చేసెనని

చెప్పిన మహాభుజంగంబునకు బజనిక చూపి
సట్టుం బలె నమ్మాటకు నుపశమించి యతని
నీరాత్రి రంభాసంభోగంబు చేయించి పిదప
దండంబున దండింపుఁడనిన వారలు దండధరు
నానతిం జని యావృత్తాంతంబంతయు నెఱుం
గ రంభ కొప్పంజెప్పిన నారంభయు నతని
యభ్యంతరగృహంబునకుం గొనిపోయి.

౧. హంసతూలికపాన్పుపై నతని నునిచి
యుచితగోష్ఠుల మెల్లనె హృదయ మెఱిఁగి
యిష్ట మొనరించి యధిక సంతుష్టుఁ జేసి
బుద్ధి చెప్పంగఁదొడఁగె నప్పువ్వుఁబోఁడి.

* * * * *

౯. ఒకపున్పము సర్వేశ్వరు
నకు నిడి కాంచితివి నీవు నవ్యసుఖం బి
ట్లికటా శివు నర్చించినఁ
బ్రకటంబుగఁ బడయరాని పదవులు గలవే!

౯. ఈయింద్రుఁ డీ కుబేరుం
డీయసురపుఁ డీయగస్త్యుఁ డీపద్మభవుం

డీయురగశాయి మొదలుగఁ
గాయజహరుసేవఁ గాంచె ఘనులై రేపుడున్.

క. అన రంభతోడ వాఁడి
ట్లను నా కివియేల యింక నతివా, నీతో
డనుగూడు సౌఖ్యమునకును
బ్రణుతింపగ నజహరింద్రపదవులు సరియే?

వ. అనుటయు రంభ వానితో నిట్లనియె.

గీ. ఊఱకె త్రెడ్డునాకి యుపవాసముడిగిన
ట్లేల చిన్నపనికి నింతవినఁగ
హరుని నాల్గుజాము లర్చింపు మఖిలసౌ
ఖ్యములు దాన నీకు నబ్బఁగలవు.

* * * * *

గీ. సౌఖ్యమనుభవింప సంతతపుణ్యంబుఁ
బోవు మూలధనము పోయినట్లు
వరుసఁ బుణ్యధనము వర్ధిల్లునట్లుగా
నిత్యసౌఖ్య మంద నేర్పు టురవు.

* * * * *

సీ. మలముఁ దోలు నెమ్ముకలును శ్లేష్మంబును
మొదలుగాఁగనైన ముఱికి డొక్కఁ

జూచి లంజెలెల్లఁ జొక్కుదు రూరక
యిందువలన సౌఖ్యమేమిగలదు.

గీ. జనకునాన నీదు జనయిత్రి మీఁదాన
ప్రాణసఖుని యాన భర్గునాన
గురువులాన శంభుఁగొలువవే యనవుడు
మూర్ఖుఁ డతఁడు చెవులు మూసికొనియె.

గీ. అపుడు రంభసూచి యల్లన నవ్వుచు
నూరకున్నఁ బలికె వారిదాసి
శ్వేతమయ్య, చనవుఁ జేకొను నామీఁది
యాన సేయవయ్య, యక్కమాట.

గీ. వెఱచి యుల్కిపడుచు విదలించుకొని లేచి
యింతమాత్రమునకు నింతయనినఁ
జెప్పు మేమియైనఁ జేసెద నీమాట
యనిన రంభ పలికె నతనితోడ.

క. అచలస్థితి బాహ్యాంత
శ్శుచివై యీనాల్గుజాలు సోమార్ధధరుగ్
రుచితోఁ బూజింపుము కృ
ష్ణచతుర్దశి నలుప మేలు జాగరమునకున్.

క. పరమేశునాఁటిరాత్రిఁ
బరికించినఁ దమకు నిలువ భారమటంచున్
దురితంబులు నిద్రాకృతి
సురమునిముఖ్యులకునైనఁజూడ్కులఁగ్రమ్మున్.

వ. అని చెప్పి రుద్రాక్షభూతిభూషణుం గావించి నిజోద్యానమున నున్న శివలింగంబునకు మ్రొక్కించి గంధపుష్పాక్షతలు, ధూపదీప నైవేద్యంబులు సమర్పించి సర్వేశ్వరున కర్పించుమని యతనికరంబున కొండొండ యందిచ్చుచుం బ్రియంబున.

సీ. అర్కపుష్పంబుల నభవునిఁ బూజింపఁ
బరధనాహార మహాపాపమణఁగు
దూర్వాంకురంబుల శర్వునిఁబూజింపఁ
బరసతీసంగమపాప మణఁగు
తులసీదళంబుల ధూర్జటిఁ బూజింపఁ
బరనిందచేనైన పాప మణఁగు
మారేడుదళముల మఱి శివుఁబూజింపఁ
బ్రహ్మహత్యాదిక పంకమణఁగు

సష్టగంధంబుల నభవునిఁ బూజింపఁ
బరహింసనక్రియాపాపమణఁగు
ధూప మర్పింపఁ గలుషనిర్ధూమకరము
దీప మర్పింప నజ్ఞానతిమిర మణఁగు
నక్షతలఁ బూజసేయఁ గామ్యార్థ మొదవు
భవునిభావింప సాయుజ్యపదము గలుగు.

క. వెలిదమ్ములఁ గెందమ్ములఁ
గలువలఁ జెంగల్వవిరులఁ గాంచనములఁ దు
మ్ములు మఱి దుత్తూరంబులఁ
గలయఁగఁబూజింపుమఖిలకలుషములణఁగున్.

క. విమలంబుగ నైవేద్యము
సమరఁగ సర్వేశ్వరునకు నర్పించిన రా
జ్యము గల్గు వీడియమ్మున
నమితంబుగ సౌఖ్యమొదవు ననవరతంబున్.

గీ. అనఁగ నతఁడు శివుని నట్ల నాలుగుజాలు
నోజ మేలుకాంచి పూజసేయ
వేగ వచ్చినంత వేవేగ జముభటుల్
వచ్చి రంభ యింటివద్ద నిలిచి.

మత్తకోకిల

నిన్న నే మిట నప్పగించిన
    నీచుఁ డెక్కడనున్న వాఁ
డన్న వారలతోడ రంభయు
    నల్లవాఁడని చూపినన్
కన్ను విచ్చియుఁ జూడ భీతిని
    కంపమొందుచు నేఁగియా
సన్నవర్తనుఁడైన కాలుని
    సమ్ముఖంబునఁ జెప్పినన్.

గీ. జముఁడు మండుచు వానిపైఁ జంప నలిగి
యరుగుదేరంగ శివదూత లతనిఁ బిలువ
వరవిమానంబుఁగొంచును వచ్చుటయును
జూచి వెఱఁగంది మదిఁ గుంది చోద్యమంది.

క. భూతపతియాజ్ఞఁ దప్పిన
నాతత మతఁ డల్గవచ్చు నగు నేమిటి కీ
పాతకున కడ్డ నేటికి
నీతెఱఁ గెఱఁగింపుఁ డనిన నెంతయు వారల్.

క. శివరాత్రి నాల్గుజాలును
శివునిం బూజింప నోండె శివనామంబుల్
శివలాంఛనములు దాల్చను
శివుఁ డతఁడేకాక మర్త్యజీవుఁడె చెపుమా.

వ. అనవుడు నజ్జముండు శివదూతలతో మును మార్కండేయునికై శివునిచేతం బడినపాటులే చాలు మీమహాత్త్వంబు నెవ్వ రెఱుంగం జాలుదు రని నమస్కరించి జముండు నిజస్థానంబున కరిగె నంత నాశ్వేతుండును విమానారూఢుండై శివునిసన్నిధికిం జని సాష్టాంగదండప్రణామంబు లాచరించినం జూచి సర్వేశ్వరుం డతనికిఁ బ్రమథపట్టణంబుఁ గట్టెంగావున నుత్తమగుణంబులుగల వారాంగనలంగలసినవారలకు మోక్షంబు సిద్ధింపకుండునేయని సుశీలుండు చెప్పిన విద్యానిధియు నది యట్ల తప్పదని యందఱు నుపచరించి పొందనియనిపిన వారును మలహాణుండును జనుదెంచి రంత.

క. ప్రాచీవధూలలామ ప్ర
తీచీ సతిమీఁద నగవుదీపింపంగా

వైచిన మణికంకణ మనఁ
బ్రాచుర్యస్ఫురణఁ దరణి పడుమటఁ బ్రాలెన్.

క. ఇనుఁ డపరజలధి శశి తూ
ర్పునఁ దోఁచిరి సెంపువదలి పొలుపొంద నభం
బనుదంతికి నిరువంకల
గనకపుఘంటికలు సురలు గట్టిరొ యనఁగన్.

క. వలిచెంగావులుఁ గపురపు
గుళికలు పరితాప మణఁచుకొఱకై దివిజుల్
మలహాణు కొనగూర్చిరొ యన
నెలకొనె నీరసముతోడ నింగిం జుక్కల్.

మ. అట కాంచెన్ ధరణీసురుండు నవసం
ధ్యావేళ వేలాగ్రప
ర్యటనేందీవరసాంద్రకందళమరం
దానందధారావళీ
నటదిందిందిరబృందతుందిలసదా
నందేందిరావందివి
స్ఫుటగానామృతసారసారముఁ గస
ద్భాసారకాసారమున్.

చ. (?) వ్రతమున లోన దేఁటి యను
పక్ష ముకుళించెడి తమ్మి యొప్పె నా
రతి సఖినిం బరండి వల
రాజు రవాజు రథాంగరావముల్
హితమతి నేకతంబ తగ
నిందిరనర్తనశాల యానిశా
పతి చెఱఁజిక్కి కూయు పసి
బాలికఁ బొంద వధూటియో యనన్.

సీ. ఇంచుపయ్యెదక్రేవ నించుక గాన్పించు
శచిదేవి దాపటికుచ మనంగ
విరహులపై దండువెడలంగఁ దమకించు
వలరాజు కెంపుగోవడ మనంగ
ఘనజగన్మోహనగంధచూర్ణం బిడ
రంజిల్లురత్నకరండ మనఁగ
నమరేంద్రముఖ్యు లాయమృతఁ గ్రోలనిచ్చినఁ
గోమరారు నమృతంపుఁ గుంభమనఁగఁ
గాయసిద్ధికి సిద్ధసంఘంబు లెల్లఁ
గూర్చుసిద్ధరసంబుల ఘుటికయనఁగ

సమరు రతిదేవి మెఱుఁగుటద్దము యనంగ
నిందుఁ డుదయించె లోచనానందముగను.

వ. అంత నామలహణుండును సంధ్యాదికృత్యంబులు దీర్చి పుష్పసుగంధిం దలంచి సఖులతోడ నిట్లనియె.

క. ఉడుగని విరహానలమునఁ
బడి వడిఁ గడునొచ్చి మిగుల బడలినవారిం
గెడగూర్చుకంటెఁ బుణ్యము
వడిఁ బాపఁ దలంచుకంటెఁ బాపముఁ గలదే.

గీ. విరులు గంధంబు మిగులను వెట్ట యగును
చెలులమాటలు చెవులకుఁ జేదులగును
ప్రాణపదమైన యంగనఁ బాయుకంటె
మఱియు దుఃఖంబుగలదొ యిమ్మహిఁ దలంప.

ఉ. మక్కువఁ బుష్పగంధి పుర
మర్దనుసన్నిధి నాటలాడి తా
నిక్కువ కేఁగుదేరఁగ ర
తీశ్వరు పట్టపుటేనుఁగో యనన్

జెక్కుల మించు తేజమును
  సిబ్బెపుగుబ్బలు మందయానముల్
చొక్కపుఁ గాంచికారవము
  సొంపును నామదిఁ బాయ దెప్పుడున్.

చ. నిలిచినయట్టితావునను
  నిల్వఁగ సైఁపదు డెంద మెంతయుఁ
గలచినయట్టు లయ్యెడును
  గంటికి నిద్దుర రాదు దేహమున్
గొలుపక లేచిన ట్లగుచుఁ
  గ్రమ్మరిలంగను సైఁపవచ్చునే
కలదొకొ పుష్పగంధి నిఁకఁ
  గన్గొనుభాగ్యము నాకు నిమ్మెయిన్.

వ. అనుటయు సుశీలుండును మలహాణునిం జూచి పుష్పగంధి జనయిత్రి హృదయం బరసివచ్చెదఁ జింతింపకుండుమని యతిరభసంబునం జని మదనసేనం గనుంగొని యిట్లనియె.

క. ధనము గడియింపవచ్చును
వినుమెవ్వరికైన మంచివిద్యయుఁ బుణ్యాం

బును గీర్తి గలుగుఁ బొందులు
వనితా, ఘటియింపరాదు వసుమతిలోనన్

క. మలహాణ పుష్పసుగంధులు
వెలయంగాఁ గూడి చదువ వీనుల కింపై
యలవడు పరమానందము
తలఁపఁగ నిపుడేల పాసి తక్కరో, యనినన్.

క. నెట్టుకొని వట్టి మాయలఁ
బెట్టకుమీ నీవు మీనుపిల్లలకేఁతల్
పుట్టించి వేయుమాంసలు
వెట్టక మరునైనఁ బూట పిల్వఁగ నీయన్.

సీ. కుదువఁ గట్టలేదు కొండిక తనవంక
వట్టి నింద పడఁగవలసె నుఱక
చదువు దయ్యమెఱుఁగుఁ జాలును బదివేలు
వచ్చె నతనిపొందు వలదు మాకు.

క. మలహాణు సుద్దులు చెప్పకు
తలఁపఁగ వెనుకటివె చాలుఁ దక్కినవేమో
తెలుపుము పురిలో వార్తలు
కలివోసిన నుట్లవంకఁ గనుఁగొనఁ దగునే.

ఉ. ఎక్కినవానికిం గుఱుచ
యేనుఁగటన్న విధంబు దా మదిం
బొక్కుచు నల్లనాఁటి మన
పుష్పసుగంధి యటంచుఁ జూచెనో
మక్కువగల్గెనేని వెడ
మాటలు మాయలు మాని గ్రక్కునన్.
రొక్కము వేయుమూడ లిటు
రోవెలఁ దెమ్మను మొక్కపూటకున్.

వ. అనుటయును సుశీలుండు పుల్లసిల్లి యేదియు
నాడలేక మగుడంజనియె. పుష్పగంధియుఁ
జాలమార్గంబునం జూచి పురపురం బొక్కు
చున్న నతిమూర్ఖుండైన యవ్వైశ్యుండును.

సీ. మొగమెత్తకుండినఁ దగిలి పీఁకియుమింద
యనుచుఁ జేతులువట్టి యదుముకొనును
జూడ కూరకయున్న సుద్దు లేమందువు
చెప్పుమంచును మీఁదఁ జేయివేయుఁ
బలుక కూరకయున్న బాపులే నీవలెఁ
బండుకోరాదని పట్టుఁ జెయ్యిఁ

గదియ కూరకయున్నఁ జదువులు చదువుచు
నిది మేలుకాదని యెత్తుకొనును
గన్నుమూసిన పొట్టిరాగాలు సేయు
నదరిపడి మిన్నకేనియు నావులించు
నిదురవోనీఁడు మేల్కని నిలువనీఁడు
వెలికినేఁగిన దానును వెంట నరుగు.

క. నిలుకాలనిలువనీయక
కలుషాత్ముఁడు బాధపెట్టఁగా విధి నాత్మఁ
బలుమాఱు దూఱుఁ గోమటి
కొలయెక్కడ గలిగెనంచుఁ గుందుచునాత్మన్.

సీ. మందులు పెట్టితో మఱగి మాపటినుండి
గుండె దీసినదనుఁ గొంతతడవు
పైత్యంబుగానోపు బగబగమనుచునో
కొలుపుచున్నది యను కొంతతడవు
తలనొప్పి ఘనమోరి తల యారదోయని
కూఁతలు పెట్టును గొంతతడవు
కనుదృష్టి దాఁకఁబోలును నాకు నని యావు
లింతలు వెట్టును గొంతతడవు

కడుపులోనంటుసొంటెమొ వడిగ నిపుడు
కుట్టుచున్నది యనుచుండుఁ గొంతతడవు
తివిరి దయ్యంబు పట్టెనో దేహమునకు
గుణముగా దనుచుండును గొంతతడవు.

క. పుటపాకంబగు వేదన
నెటువలె సైరింపవచ్చు హృదయేశ్వరు కౌఁ
గిట సౌఖ్యజలధిలోపల
నటయంతయుఁదెలియ నోలలాడక యున్నన్.

క. బెడిదమగు విరహవేదన
వడివేగగ నీనిచేత బాధయు నయ్యెన్
వడి నోరుచుట్టుమీఁదను
నడరఁగ రోఁకంటిపోటు ననుచందమునన్.

క. అసియాడెడు నెన్నడుమును
వసివాడిన దేహలతయు వాడినతెప్పల్
దెసలాలకించువీనులు
కసుగందిన నెమ్మనంబుఁ గదురగ నంతన్.

క. అలుగుచు నలుగుచు గలఁగుచు
నలికుంతల వానిబాధ నటువడుచుండెన్

సీ. కానంగ గలదొకో కమలాయతాక్షిని
గలలోననైనను గన్నులార
నానంగఁ గలదొకో హంసేంద్రగామిని
చనుదోయి యురమునఁ జాదుకొనుచుఁ
గ్రోలంగఁ గలదొకో గురునీలకుంతల
యధరామృతముచవు లాత్మఁ దనియ
భావింపఁగలదొకో భామాలలామతో
ససమానరతికౌశలానుభవము
వినఁగఁగలదొకొ యొకనాఁడు వీనులలరఁ
దరుణి మునుబోలె శంభుగీతములు పాడ
నిలుపఁ గలదొకొ యొకనాఁడు నెలఁతఁగూడి
లీల మెఱయంగ నంగజకేళిఁ దేల.

సీ. అంగనమధురోక్తు లాలకించినఁగాని
వీను లన్యులమాట వినఁగరోయు
వెందదివిలాసంబు వీక్షింపనే కాని
చూడ్కు లన్యంబును జూడరోయుఁ
గలకంఠి తనువల్లిఁ గౌఁగిలింపనె కాని
తనువన్యకాంతల దాయరోయు

జలజాక్షి కెమ్మోవి చవి యానవే కాని
జిహ్వా యన్యంబు రుచింపరోయుఁ
జిత్త మన్యులఁ గలనైనఁ జేరరోయుఁ
గోర్కు లన్యంబు లెవ్వియుఁ గోరరోయుఁ
దలఁపు లన్యంబు లెవ్వియుఁ దలఁపరోయుఁ
గలదకో సుమగంధిని గలయ నాకు.

క. వనిత నెడబాయఁజాలక
తనువున నిడుకొన్న శివుఁడు తా సర్వజ్ఞుం
డనయము నొందులతనువులు
తనవలెనే సేయకునికిఁ దగవా తనకున్.

గీ. వెలఁదికిని నాకుఁ బొందులు వేఱుసేసి
ప్రాణములు వేఱుచేసెను బాపజాతి
బ్రహ్మ యిరువురి తనువులుఁ బ్రాణములును
నేకముగఁ జేయఁడాయె నింకేమి గలదు.

క. వేడుకఁ బుష్పసుగంధిని
గూడుండేనాళ్లవలెను గొనకొని యాత్మక్
గూడుకొనె నొక్కలెక్కను
నీడుగ నలతమ్మిచూలి యీ దివసంబుల్.

ఉ. చొక్కపు ముద్దునెమ్మొగము
సోగమెఱుంగును నోరచూపులున్
చిక్కని గుబ్బచన్నులును
జెల్వగు నీవరరూపవైభవం
బక్కట నామనోంబుజము
నంటె సమస్తము గించి యొంటి నీ
వెక్కడనున్నదానవు మృ
గేక్షణా, పుష్పసుగంధి, చెప్పవే.

గీ. కన్ను విచ్చినపుడు కాన్పింతు మనసునఁ
గన్నుమూయ నెదుటఁ గదలకుండు
పట్టఁ జిక్కవడవు ప్రాణేశ్వరీ, యింత
యింద్రజాలవిద్య యెఱిఁగితెట్లు.

సీ. నీముద్దుమాటలు నిరతంబు వినఁగోరి
తవిలి నావీనులు తపము సేయు
నీగుబ్బచన్నులు నెమ్మిఁ గౌఁగిటఁ జేర్పఁ
దవిలి నాహృదయంబు తపము సేయుఁ
జక్కనినీమోవిచవి యానఁగాఁగోరి
తవిలి నానాలుక తపము సేయు

నీమోహనాకృతి నిరతంబుఁ జూడంగఁ
దవిలి నాకన్నులు తపము సేయు
నీవిలాసంబు నాయాత్మ నెలవుకొల్పి
తలఁపులన్నియు నినుఁగోరి తపముసేయుఁ
బ్రాణములకును బ్రాణమై పరగు నీవు
ఉవిద, నినుఁబాసి యెట్లింగి నోర్చువాఁడ.

సీ. అంబుధి దావాగ్నికైన నోర్చునుగాని
యోర్వలేదు నదీవియోగమునకు
నబ్జారి రాహువుకైన నోర్చును గాని
యోర్వఁడు తారావియోగమునకు
హరుఁడు హాలహలాగ్నికైన నోర్చునుగాని
యోర్వఁడు గౌరీవియోగమునకు
నభ్రంబు పిడుగులకైన నోర్చునుగాని
యోర్వలేదు తటిద్వియోగమునకు
నతనుఁ డీశ్వరునయనాగ్నికైన నోర్చుఁ
గాని యోర్వఁడు రతివియోగంబునకును
విశ్వభయదోగ్ర నిర్వక్త్రోగ్ర విరహవహ్ని
నువిద నినుఁబాసి యేభంగి నోర్చువాఁడ.

ఉ. జక్కవ లుక్కుదక్క జల
జంబులు స్రుక్కఁ జకోరరాజియు
న్నెక్క వియోగు లుక్క తటి
నీశుఁడు నిక్క మనోజు పంతముల్
దక్క ముదంబు కెక్కఁ గుము
దంబులు చొక్కఁ దమంబు మక్క నా
చుక్కలఱేఁడు వేఁడిమిదె
చూపెఁగదే వడిఁ బ్రాణనాయికా!

ఉ. హాలహాలంబు గ్రమ్మఱ ను
దగ్రతఁ బుట్టెనో చండభానుఁ డా
భీలత నన్నిమూర్తులను
భీకరభంగిని గాయఁజొచ్చెనో
గాలుని తీవ్రమౌ ప్రళయ
కాలమహానల మేఁగుదెంచె నో
ఓలిమిఁ జంద్రరోచు లిటు
లుండునె చూడ్కికిఁ బ్రాణనాయికా!

చ. ముదిరినసాంద్రచంద్రికలు
మొత్తపుచంచుపుటంబులందిడిఁ

గుదిలిచి చించి చీఱి కడుఁ
గ్రొవ్విన వెన్నెలగుజ్జు ముక్కునన్
ముదితల కందియిచ్చుచుఁ బ్రి
మోదము నొందెడు నాచకోరముల్
కదిసిన నీదుకన్నుల వి
కాసము దోఁచెను ప్రాణనాయికా!

ఉ. వాలికలై మనోజభవ
వాలికలై సరసాలిచారు దృ
క్కేలికలై చకోరముల
కేలికలై కమలాలిహల్లకో
న్మాలికలై సుగంధనన
మాలికలైన భవన్మనోజ్ఞ దృ
గ్జాలికలీనఁ జేసి మది
జాలిఁక మాన్పుము ప్రాణనాయికా!

ఉ. ఇక్కలి దక్క నిక్క మెఱుఁ
గెక్క మొగెక్క బిగెక్క మిక్కిలిన్
గ్రిక్కిరి సొక్కమానమయి
గ్రిక్కినఁ బక్కన విచ్చునోయనన్

ఎక్కటి లుక్కుమీఱి తగు
లింకపునీచనుదోయి మాటునన్
జిక్కిన నేమొకాని మరు
చేఁ బడరాదికఁ బ్రాణనాయికా!

చ. వెర విఁక నేది నాకకట!
వీఁడె మనోభవుఁ డేగుదెంచె వి
స్ఫురదళిశింజినీవికచ
సూనశిలీకధనుఃపికానళీ
వరకలకంఠకాహళర
వస్ఫుటకంపిత భూర్భువస్సువ
శ్చరుఁడగుచున్ బ్రతాపమున
సల్పెడిదేమిఁకఁ బ్రాణనాయికా!

ఉ. ఎక్కడ నేదరింతు నిఁక
నేవగఁ బట్టుదుఁ బ్రాణవాయువుల్
చిక్కితి మన్మథాగ్నిఁ గడుఁ
జేసెడి దేమిఁకఁ గంబుకంఠి, యో
నక్కనికీరవాణి, జల
జాతవిలోచన, పుష్పగంధి యే

చక్కటినున్నదానవు ని
జంబుగ నా కెఱుంగంగఁ జెప్పవే.

ఉ. నన్నెడఁబాయఁజాల వొక
నాఁటికిఁ గంటికి ఱెప్పకైవడిన్
గ్రన్ననఁ గప్పుకొందు విదె
కంతుని బారిని దూరఁజిక్కితిన్
సన్న యెఱింగి మున్న రతిఁ
జల్లనిఁతియని ముద్దుగొఁగి లిం
కెన్నఁడు నాకు నిచ్చెదు మృ
గేక్షణ, పుష్పసుగంధి, చెప్పవే.

వ. అని విరహవేదనం బొఁగిలి పొగిలి మున్న పుష్ప
సుగంధియు దానుం గూడియుండెడు నుద్యా
నవనంబులోపలికి నరిగి యిట్లనియె.

సీ. హరిణంబ, కానవే హరిణాయతాక్షిని
మధుపంబ, కానవే మధుపవేణి
హంసంబ, కానవే హంసేంద్రగామినిఁ
బులినంబ, కానవే పులినజఘనఁ
గలకంఠ, కానవే కలకంఠకంఠిని
గిసలయ, కానవే కిసలయోష్ఠి

నవలత, కానవే నవలతాతన్విని
గీరంబ, కానవే కీరవాణిఁ
గానవే రంభ, రంభోరుకాండయుగళిఁ
జక్రవాకంబ, కానవే చక్రకుచను
బుష్పవనవాటి, కానవే పుష్పగంధిఁ
జందురుఁడ, కానవే పూర్ణచంద్రముఖిని.

సీ. విను సుధాకరుఁడవు విష మేల కురిసెదు
చందమామా నీకిది చందమామా,
శీతాంశుఁడనుపేరు చెఱిచి నిప్పులు గ్రక్కఁ
జందమామా నీ కిది చందమామా
కువలయాప్తుఁడవయ్యుఁ దవిలి పాంథుల నేఁపఁ
జందమామా నీకిది చందమామా
శివునకు నవతంసమవు మరుఁగూడంగఁ
జందమామా నీకిది చందమామా
విబుధులను బ్రోచుదాతవు వినుము నీవు
సుద్దములు బద్ధములు గావు సుద్దులెల్ల
నఖిలకళలందుఁ బ్రోడవైనట్టి నీకుఁ
జందమామా హింసగావింపఁ జందమామా.

క. అచ్చిన ప్రియసతిఁ బాసిటు
వెచ్చుచునున్నట్టి నాకు వేఁడెమిఁ జూపక
వచ్చిన చోటికి వచ్చెదు
నిచ్చో ఫలమేమి నీకు నిందుఁడ యనుచున్.

వ. అని మలహాణుండు దుఃఖావేశంబున;

క. కలయంగఁ గలుగు భాగ్యము
కలుగుట దుర్లభము చూడఁగల్గిన యేనిఁ
గలసినయంతయ లేదా
వెలఁదుక నీమాటలైన విన్నం జాలున్.

వ. అనుచు మదనోన్మాదంబున మలహాణుండు
"కామాంధో ఽపి నపశ్యతి" యనియెడుం
గావునఁ దన ప్రియురాలిం దలంచుకొని పుష్ప
సుగంధియున్న మేడ సమీపంబునకుఁ జను
దెంచి నిలిచి నాయికమాట లాలకించుచుండె.
అంత నప్పొలంతియు మలహాణుం దలంచి
యంతఃపరితాపంబు వారింప నుపాయంబు
లేక యెంతయు.

సీ. ప్రేమతోఁ బ్రియుఁడు చెప్పినగీతము ల్పాడి
యడరి డగ్గుత్తికపడి నిలుచును
సోమార్ధధరుమీఁది చూర్ణికల్ చదువుచు
హా ప్రాణనాయక, యని తలంచు
జంత్రంబు చూపుచు జాగులే వల్లభ,
నినుఁబోల నెవ్వరు నెనయ రనునుఁ
దానమానములకుఁ దలఁచూఁచి మలహాణ,
మెఱుఁగుదుగా నీవు నించుకనును
సుదతి ప్రాణేశు లోచూడ్కిఁజూచి పొక్కి
బయలుఁ గౌఁగిట నిఱియించుఁ బరవశమున
నధరసుధఁగ్రాఁగి పోవంగఁ గలఁగి కలఁగి
యెందు నున్నాఁడవో నన్ను నిచట నొంటి
డించఁదగవౌనె ప్రాణేశ, యంచు వగచు.

సీ. అతనిసుద్దులు ప్రేమ నందంద తలపెట్టు
నతఁడు దిద్దినచిల్క నడుగు మాట
లతఁడు చెప్పిన కత లక్కిలి వచియించు
నతనికైవడిఁ బాట లడరిపాడు
నతఁ డాడుసరసోక్తు లల్లనఁ బచరించు
నతనిగుణంబులె యభినుతించు

నతనిఁ గూడాడిన యచ్చోటులే యెంచు
నతనిభావమె తనయాత్మనించు
నతఁడుఁ దానును ముట్టిన యట్టిమతులు
ముట్టి తలచూఁచి తనుఁదానె తిట్టుకొనుచుఁ
జెలఁగి యాతఁడు దానును గలయు భావ
మంత భావించి శంకరా, యని తలంచు.

సీ. వెలఁది నిట్టూర్పులు వెలికిఁ బైపడనీక
పూబంతిమీఁద నేర్పున వహించు
గ్రుక్కుచుఁ గన్నీళ్లు కొలుకులఁ గ్రమ్మఁగ
నలుసు సోఁకెనదని పులిమి తుడుచుఁ
దనువల్లి కాఁకఁ గ్రాఁగినపాన్పు క్రొవ్విరుల్
కనుపడనీయక వెనుకఁ ద్రోయు
వదలని తాపాగ్ని పడచల్లు మరుబెట్ట
పొరిఁబొరిఁ ద్రిప్పఁ గప్పురపుసురటి
ప్రాణవిభు నాత్మ భావించుఁ బలవరించు
వెలికిఁ జను నిండువెన్నెల వేఁడికంత
నులికి లోఁజను నందును నుండలేక
పొగిలి వగఁబొంది మదిఁగుంది పుష్పగంధి.

క. ఇందునిచే నోడ లుడుకఁగ
గుందును వెలి లోన మాడుకొ అవ్వులచూడఁగ
ఎందు సహింపదు దైవము
ముందఱనుయి వెనుకబొంద మొగిననుటయ్యెన్.

క. ఈవేళ మత్ప్రియుండగు
జీవితపతి మోముఁజూడఁ జేకుఱెనేనిఁ
దైవంబు కరుణ నాపై
నేవిధమునఁ జాలఁగల్గు టెఱుఁగఁగ వచ్చున్.

గీ. చంద్రకాంతపు గిండి వాసనజలంబుఁ
గొనుచు వాకిటి కరుదెంచి కువలయాక్షి
వెడఁదకన్నులుఁ బెదవులుఁ వడుపుకొనుచు
నుమ్మలిక నొయ్యఁ బుక్కిలించుమియుటయును.

గీ. దద్దరముచేత నాచులోఁ దమ్మివిరిని
నున్న యెలతేఁటిపైఁ దేనె యొలికినట్లు
మలహాణునిమీఁదఁ బడియె నాజలకణములు
మదనసంతాపవహ్నికి మాటుదోఁప.

వ. అప్పుడు మలహాణుండు శివస్మరణంబు నేసి
తనలో నిట్లనియె.

క. కన్నప పుక్కిటినీటఁ
గన్నప కీర్తులఁ బాసెఁ గటకట, నేఁడీ
కన్నియ యధరామృతమును
గ్రన్ననఁ గానఁగవయుకతన గౌరీశునకున్.

గీ. అనిన పలుకు చెవులు నాలించి ప్రాణేశుఁ
డౌల మొఱఁగి యొయ్య నతనిఁ గదిసి
యెట్లు వచ్చితివటి కీవేళ యనుచును
ముదము భయము మదిని ముడివడంగ.

గీ. బిగియఁ గౌఁగిలించి బింబాధరము చవు
లిచ్చి యిచ్చి క్రోలి యిచ్చవగచి
ప్రాణనాథ, నీకుఁ బాడియె యొక్కఁడ
విట్లు లరుగుదెంచ మిటుఁ గి మఱియు.

సీ. గ్రక్కునఁ దలవరుల్ గని పట్టుకొనిరేని
నరయ నాదోష మెవ్వరికిఁ దగులుఁ
బతితేర నచ్చటఁ బాము దే లంటిన
నాహత్య యెవ్వరి కతిశయిల్లు
మీతల్లిదండ్రులు లోమియుఁ బుత్రశోకాగ్నిఁ
గన నది యెవ్వరి కొని మునుంగుఁ

గావలివార లొక్కంత యెఱింగిన
నాడిక యెవ్వరి కతిశయిల్లు
నడుమ నవకార్యమేమైనఁ బొడమనేని
నట్టి కింకయు నెవ్వరిఁ జుట్టు కొనును
నెఱయ సకలంబుఁ దెలిసిన నిపుణమతివి
యకట పఱచుట ప్రాణేశ, యర్హమగునె?

ఉ. నీచెల్వంబును నీవిలాసము మఱిన్
నీధైర్యగాంభీర్యముల్
నీచాతుర్యము నీగుణాంకమహిమల్
నీపెంపునుం జూడ కే
ప్రాచుర్యంబును బోవనాడితివి యీ
పాపంబు ప్రాణేశ, నా
కేచందంబునఁ బాసిపోవు నకటా!
యెన్నే నిజన్మంబులన్.

వ. అని దుఃఖావేశంబునఁ బొగులుచు:

క. కడుఁ గాకలీస్వరంబున
విడువక యొయ్యొయ్యనవల వెక్కుచు నేడ్చెన్.

కడవలను గ్రుమ్మరించిన
వడువునఁ గన్నీరు మేన వఱదై పాఱెన్.

క. సూనశరవహ్నిఁ గ్రాఁగుచు
మేనంతయుఁ బలుకఁబాఱి మిగులఁ గృశించెన్
నానోముఫలము లిట్టివి
ప్రాణేశ్వర, నిన్ను నేచఁ బాలయితిఁగదే.

గీ. కుటిల వర్తనంపుఁగులమున జన్మించి
చెడుగులకును బుద్ధి చెప్పఁగాని
పుణ్యనిధివి నిన్నుఁ బొందొందుభాగ్యంబు
నాలి దైవమేల నాకు నిచ్చు?

క. వఱదం బడిపోయెడు సతి
కురవడియు న్నొగులుమాన్ప నోపునె తాన
త్తెఱఁగున వీరలచేఁ బడి
యుఱక నినుం బాసి నొగులుచుండఁగవలసెన్.

క. వ్యాళీవిమదంష్ట్రోగ్ర
జ్వాలల నయిదోడులగుచు జనియించిన దు
శ్శీలల వేశ్యామాతల
నేలా పుట్టించె నజుఁడు నెఱుఁగఁడు సుమ్మా!

సీ. గుల్లాల నూరక కొండగాఁజేయును
నీవన్న నెంతయుఁ జావ నలుగుఁ
బలుగాకులను గన్నఁ బ్రాణంబు లొసఁగును
నినుఁ జూచె నేనియుఁ గనలిపడును
హీనుల కెంతయు హిత మాచరించును
నీపట్టు కన్నంతఁ ద్రోపు సేయుఁ
జెడుగులఁగన్నను శిరసావహించును
నీవారమన్నను నిలువనీదు
వినుమ యలవోక నీపేరు విన్నమాత్ర
రాఁజుచుండును మోము నిరంతరంబుఁ
జిత్త మలరంగ నీవును జేయునట్టి
భాగ్య మబ్బునె పరమనిర్భాగ్యులకును.

సీ. కడుముట్టఁ దల్లిచేఁ గసికోఁతలే కాని
యొకనాఁడు హాయిని నుండలేదు
పొన్నిండ్లఁ బడిపంచఁ బొగులంగనే కాని
యొకనాఁడు నినుఁగూడి యుండలేదు
కరకరలును వట్టి కక్కసంబులె కాని
యొకనాఁడు నుడుకారి యుండలేదు

ఎవ్వరు విందురో యిది యననేకాని
యొకనాఁడు నిశ్చింత నుండలేదు
నీవు నాకయి యాహార నిద్ర లుడిగి
యుండు మన్నట్టి చోటనె యుండియుండి
చిక్కి నరమైతి వేమని చెప్పుదాన
నిట్టిదశకును మన కింక నేది తెరువు.

క. వచ్చెద నే నీవెంటను
నెచ్చోటికినైనఁ గొంచు నేఁగుము లేదా
యిచ్చట నేమట నేయుము
పచ్చనివిలుకాని బారిఁ బడఁజాలఁ జుమీ.

వ. అనుటయు మలహణుం డిట్లనియె.

గీ. వెజ్జు బమ్మరించువిధమున నాకును
బుద్ధి చెప్పి నీవు పొగులఁ దగునె
రూఢి వెట్టి దిరిగ రోఁకలిఁ దలఁజుట్టు
మనిన చందమయ్యె నంబుజాక్షి!

వ. అనుటయు నెట్టకేలకు ధైర్యంబుఁ దెచ్చుకొని
యరుణోదయంబునఁ ద్రిపురాంతకుని గుడికి
నృత్యంబు సలుప నేను వచ్చెద నచ్చట నుండు

ముని నీవును నేనును దానికిఁ దగిన తెఱంగు
చూచుకొందమని మలహాణు నంపి తానును
గ్రమ్మర వచ్చునెడ నటమున్న యవ్వైశ్యాం
డును.

గీ. కౌఁగిలింపలేదు కడువేడ్కఁ గెమ్మోవి
మానలేదు రతికిఁ బూనలేదు
సుదతివలన వట్టిసుద్దులు ముద్దులు
గతులు గితులుఁ జాలుఁగాని యనుచు.

క. వ్యర్థఁ దల్పుగడియ పెట్టుకొ
శిథిలాత్ముఁడు దాసితోడఁ జెనకుచునుండెన్
క్షుధనొందినట్టి పిల్లికి
విధిమూడిన యెల్క లేదె వెదకిన నైనన్.

వ. ఇట్లున్న యవ్వైశ్యుని నెళవునం జూచి రోయు
చుఁ గవాటబంధనంబు సేయించి విలాసినిం
గావలిం బెట్టి కృతస్నాతయై వివిధభూషణ
భూషితాంగి యయ్యె నంత.

క. తారాగణపరివారము
తారాగిరిరాజువెంట దండుకొఁ బనుపన్

చీరికి దరుఁబోయి నగరు
తోరంబై వేగుఁజుక్క తూర్పునఁ బొడిచెన్.

సీ. ఇంద్రుఁ డంబుధిఁ బైఁడియుస్మగొల్మిని వెట్టి
కరఁగించు కరువుముఖం బనంగ
నైరావతంబున కలికభాగంబునఁ
బెట్టిన జేగురుబొట్టనంగ
నె[illegible] నిర్మించి మించిన
కరమొప్పు పసిఁడిపళ్లెర మనంగ

...............................

నుదయగిరిమీఁద నప్సరోయువతు లిడిన
నిద్ధమైయొప్పు కుంకుమముద్ద యనఁగఁ
బ్రాగ్వధూమణి సొమ్ముల బరణియనఁగఁ
దరణి యుదయించు సుప్రభాసరణి మెఱయ.

వ. అంత మేళంబులవారితోడఁ బున్నసుగంధి త్రిపురాంతకదేవుని గుడికిఁజని నృత్యగీతవాద్యంబులు సలిపి పరిజనంబులం బడఁదని మల్హణుం బిలుచుకొని గర్భద్వారంబున నిలిచి యాద్దేవునిం జూపి యిట్లనియె.

సీ. ముక్కంటి భర్తుల ముంగిటిపెన్నిధి
చిత్తజవైరి సంజీవికరణి
పురదైత్యలోకసంహారుండు సిద్ధరసంబు
బాలచంద్రధరుండు పరుసవేది
శ్రీపార్వతీశుండు చింతామణిశ్రేణి
కుండలికటకుండు కొంగుపసిడి
రుద్రుండు దక్షునరోహణశైలంబు
ఖండేందుమౌళి బంగారుకొండ
యసమనేత్రుండు నింకని యమృతజలధి
కాలకంఠుండు చేరువ కల్పశాఖి
విశ్వనాథుండు మనపాలి వేల్పుటావు
తలఁపు మిప్పుడు కామితార్థములు గల్గు.

క. శతధృతిశతమఖముఖ్యుల
కతిదుర్లభుఁ డెన్నిచూడ ననవరతంబున్
మతిఁ దలఁపఁగ సద్భక్తుల
కతిసులభుఁడు దేవదేవుఁ డభవుఁడు జగతిన్.

క. ఇల బాణమయూరాదుల
కలరెన్ గోర్కులు కవిత్వమందునె కాదా

వలనగు గవితాతత్త్వము
వలనంబడయంగరాని వస్తువు గలదే.

క. పరిమళములలోఁ గస్తురి
తరువులలోఁ జందనంబు దైవంబులలోఁ
బరమేశుఁడు విద్యలలో
వరయంగాఁ గవిత యెక్కుడగునని రార్యుల్.

క. మాటలె ధనములమూటలు
మూటలె భువనైకముఖ్యమంత్రౌషధముల్
మాటలె ముక్తికి నెలవులు
మాటల నొనఁగూర్చి చెప్ప మతమదియైనన్.

సీ. ప్రకటింప మేకపెంట్రుక లింగమనికొల్వఁ
గోర్కె లీయఁడె కాటకోటనికిని
బ్రమదంబుతోడఁ గుంచము లింగమని కొల్వ
(?) గోష్టియువానికి గోర్కెలీడె
లీలమై సతిచన్ను లింగమంచు భజింప
నోడయనంబికి నీఁడె యడుగు కోర్కె
తమకంబునను సైకతము లింగమని కొల్వ
నిచ్చఁగోరిక లీఁడె యింద్రజునకు

నిముసమాత్రంబు శివునిపై నిలుపుదృష్టి
తలఁపు లితరంబులందునుఁ దగులనీకు
మించుదళుకొత్తఁ గ్రొత్తయై మెఱుఁగుఁగవిత
చెప్పి సర్వేశు సన్నిధిసేయు మనిన.

క. తరుణీ, నామన సెంతయు
నరయఁగ నీమీఁదఁ దగిలి యన్యంబులపై
నరనిముసమైన నిల్వదు
వెఱవెయ్యదియునినఁ బలికె వెలఁదుక మఱియున్.

క. చనుఁగవ వీపున నానుక
నినుఁ బాయక కౌఁగిలించి నేనుండెద నీ
వెనుకను నిశ్చల మతివై
కొనియాడుము శంభుఁ గోర్కె కొనసాగంగాన్.

చ. అటువలె నంటివేని జల
జానన, యేనును నాదిభోగిరా
ట్కటకు నుమాకళత్రు శితి
కంధరు సన్నుతిచేసి నీదు ముం
దట నట మెచ్చు చేకొనియె
దఁ విను నావుడు నింతి యట్లు కౌఁ

గిటుఁ గదియించె భక్తిఁ బరి
కించె శివుఁ నుతియించె నాతఁడున్.

చ. తరుణికచంబు క్రొవ్విరుల
తావికిఁ జొక్కిన తేఁటి యట్ల శం
కరుఁ డిలఁ జేఁటియో యనుచుఁ
గామిని దెల్పుట కంధి క (?)
ర్బురనిభకంధరాయ సుర
పూజితపాదపయోరుహాయ భా
స్కరశశిలోచనాయ పుర
సంహరణాయ నమోనమో యనన్.

సీ. జడముడి దోఁకాడు జాహ్నవీనదితోడ
మే సగమున నున్న మెలఁతతోడ
ప్రక్కలఁ బ్రణుతించు ప్రమథవర్గముతోడ
జయవెట్టు దేవతాసమితితోడ
బంగరుదు బ్రహ్మలపునుకపేరులతోడ
నటన మిన్నందిన నందితోడ
గాలిచే నల్లనఁ గదలుసొమ్ములతోడఁ
బులితోలుపట్టు దువ్వలువ తోడఁ

బాలుపుమిగిలిన వలపు విభూతితోడ
మహిమ దళుకొత్తు రుద్రాక్షమణులతోడఁ
గ్రమ్మునొదల చంద్రఖండమ్ముతోడ
నమరి సర్వేశ్వరుండు ప్రత్యక్షమయ్యె.

క. మెచ్చితి మలహాణ, కోరిక
లిచ్చెద నేమైన నడుగు మిహాపరములలో
నిచ్చకు వచ్చిన విప్పుడు
నచ్చిన నెచ్చెలివి నీవు నా కెన్నంగన్.

వ. అనుటయుఁ బునఃపునః ప్రణామంబు లాచ
రించి యిట్లనియె:

సీ. పూజింతుఁ బుంగవపుంగవ కేతను
 నర్చింతు మారుతాహారహారు
వర్ణింతు నాత్మీయ వామాంగ వామాంగు
 భజియింతు నిర్జిత బాణబాణు
వినుతింతు శరశుభ్ర విగ్రహావిగ్రహు
 భావింతు శతకోటిభానుభాను
నుతియింతుఁ బదపద్మనతజంభభంజను
 మది సంస్మరింపుదు మారమారు

నంతకాంతకు నేప్రొద్దు నాశ్రయింతుఁ
గరము వేడ్క నుపాసింతు శరధిశరధి
లీల సేవింతు హరినీలనీలకంతు
నెలమి నినుఁ గొల్తు భువనత్రయీశు నీశు.

క. భేశ వృషభేశ కాశా
కాశధునీసుప్రకాశ గౌరాంగునకున్
కేశవనుతునకు నంబర
కేశునకును శరణు నీకు గిరిజాధీశా!

క. పాటలపాటలమకుటని
శాటునకున్ గలుష జలధిజంఝాటునకున్
శాటీకృతమదకరటిని
శాటననవచర్మునకును శరణము నీకున్.

క. ఖండశశిఖండమాళికి
నండజకేతనమదాండ జాండావళికిన్ (?)
కుండలిపరివృతవిలస
త్కుండలికిని శరణు నిఖిలగురునకు నీకున్

క. ఈపుష్పగంధిఁ గూడుక
యేప్రొద్దును ప్రమథవరుల నీక్షింపుచు నీ

నందనపూజనస్తవజ
నస్తవనీయదయాకులాశయా
స్పందితదివ్యముఖ్యగుణ
బంధుర బంధురమావిధాయకా.

క. రామామాత్యకుమారక
సోమాంబాగర్భసింధుసురుచిరసోమా
రామాజనమానసలతి
కామాధవ విస్సమాంబికాప్రాణేశా!

మాలినీ. శరధినిభగభీరా శత్రుగర్వాపహారా
నిరుపమగుణహారా నీతిమార్గప్రచారా
పరిజనపరిచారా బంధురత్వోవిహారా
సురగిరివరధీరా సోమమాంబాకుమారా.

గద్యము

ఇది శ్రీమత్సకలసుకవిమిత్ర సోమయామా
త్యపుత్త్ర సరసకవితాధుర్య యెఱ్ఱయనార్య
ప్రణీతం బైన మలహాణచరిత్రం బను మహా
ప్రబంధంబునందు సర్వంబును దృతీయా
శ్వాసము.

---